# కాలం వెంట నడిచి వస్తున్న...

(నమిలికొండ బాలకిషన్‌రావు అభినందన సంచిక)



స్నేహసాహితి

వరంగల్లు

# కాలం వెంట నడిచి వస్తున్న...

(నమిలికొండ బాలకిషన్‌రావు అభినందన సంచిక)

శ్రీలేఖ సాహితి రజతోత్సవాల సందర్భంగా



సంపాదకత్వం

డా॥ టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి

సాహిత్య, సాంస్కృతిక సంస్థ

(స్థాపితం : 1977 రి.నెం. 2337/89)

ఇ.నెం. 5-11-481, విద్యారణ్యపురి,

హనుమకొండ, వరంగల్లు - 506 009

**2002**

# KALAM VENTA NADICHI VASTHUNNA...

*(Namilikonda Balakishan Rao Abhinandana Sanchika)*

*Edited by* **Dr. T. SRIRANGA SWAMY,** M.A., Ph.D.

**PUBLICATION No. 36**

**MARCH, 2002**



**Price Rs. 40/-**

*For Copies :*

SRILEKHA SAHITHI
H.No. 5-11-481, Vidyaranyapuri
HANAMKONDA - 506 009 Dist. Warangal.

VISALAANDHRA PUBLISHING HOUSE, Hyderabad
and its BRANCHES

*Printed at*

SRI SHANTHI Offset Printers, Hanamkonda. Ph. 579541

# స్నేహం...

సాహిత్యమును సృజించడం ఒక ఎత్తు. ఆ సాహిత్యమును నలుగురికి తెలిసేలా చేయడం మరొక ఎత్తు. సాహిత్యమును సృజించడముతోపాటు నలుగురికీ ఉపయోగపడే వారిని అభినందించడము అనేది ఇంకొక అంశము. ఈ అంశమును దృష్టిలో ఉంచుకొని శ్రీలేఖ సాహితి రజతోత్సవాలు జరుపుకొంటున్న సంరంభంలో ఆ నలుగురిని గుర్తించి సత్కరించడము కూడా ఒక సంప్రదాయం. ఆ సంప్రదాయములో భాగంగా అనిశెట్టి రజిత, పొగాకు సుదర్శన్, పి.వి. రవీంద్రనాథ్, నమిలికొండ బాలకిషన్‌రావులకు సత్కారమును అందిస్తున్నాము. మిత్రులు శ్రీ బాలకిషన్‌రావుగారికి ఈ అభినందన సంచిక సత్కారము లోని భాగమే, సంస్థ ప్రచురణలలో ఇది 36వది.

బాలకిషన్‌రావు గారు ప్రవృత్తిరీత్యా కవి, పత్రికా సంపాదకుడు, వ్యాసకర్త, కథకుడు, రెండు, మూడు నాటికలు రాసారు. అయితే ఇవి అన్నీ ఒక ఎత్తు సహృదయత మరొక ఎత్తు. ఈ సహృదయత ఆయన వృత్తిలోనూ, ప్రవృత్తిలోనూ సమంగా ప్రవర్తిస్తూనే ఉంది.

సాహితిసంస్థ నిర్వాహకుడుగా సాహితి సదస్సులకు చేకొమ్మఅయినాడు. ఈఅంశాల్లను దృష్టిలో ఉంచుకొని నమిలికొండ బాలకిషన్‌రావుగారి అభినందన సంచికను "కాలం వెంట నడిచి వస్తున్న..."దిగా అందిస్తున్నాము. ఆయన జీవనయానంలో మరిన్ని సత్కారాలను, మరిన్ని రచనలను అందించాలని మనసారాకోరుకుంటున్నాము. మా ఈ చిరుప్రయత్నానికి తన ఆమోదం తెలిపిన మిత్రుడు శ్రీబాలకిషన్‌రావుకు మా కృతజ్ఞతలు. 'కాలం వెంట నడిచి వస్తున్న...' అభినందన సంచికకు తమ వ్యాసాలను సకాలములో అందించి సహకరించిన వ్యాసకర్తలకు ధన్యవాదాలు. "స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిది" అన్న మా సూక్తికి వీరందరూ నిదర్శనమే...

"శ్రీలేఖ సాహితి" గమనములో తమ సహకారమును అందిస్తున్న మిత్రులకు, శ్రీనరసింహారెడ్డి గారికి వందనచందనాలు.

సాహితీ సేవలో ...

**డా॥ టి. శ్రీరంగస్వామి**

అధ్యక్షుడు

శ్రీలేఖ సాహితి, వరంగల్లు.

తేది : 31-03-2002,

వరంగల్లు.

# శ్రీలేఖ సాహితి ప్రచురణలు...

| | | |
|---|---|---|
| 1. | శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి | రూ. 10.00 |
| 2. | కవితా గానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. 3.00 |
| 3. | ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥ జి. దామోదర్ (తెలుగు అనువాదం) (రెండవ ముద్రణ) | రూ. 60.00 |
| 4. | వేణుతరంగాలు - శ్రీ యల్. వేణుగోపాల్ రావు | రూ. 5.00 |
| 5. | ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం | |
| 6. | వరంగల్లు జిల్లా రచయితలవాఙ్మయజీవిత సూచిక - శ్రీ టి.శ్రీరంగస్వామి | రూ. 15.00 |
| 7. | కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. 6.00 |
| 8. | జన్మభూమి సిరులు - శ్రీ పల్లె సీను | రూ. 6.00 |
| 9. | జీవనరాగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు | రూ. 10.00 |
| 10. | శుక్ల (కవితా సంకలనం)- శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాటకత్వం) | రూ. 5.00 |
| 11. | ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు | రూ. 9.00 |
| 12. | ప్రమోదూత (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 6.00 |
| 13. | నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు | రూ. 3.00 |
| 14. | ఏకశిల వైతాళికులు(వ్యాస సంకలనం)-శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 15. | ప్రజోత్పత్తి (కవితాసంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 6.00 |
| 16. | కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి | రూ. 15.00 |
| 17. | కావ్యం-కవిస్వామ్యం - డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు | రూ. 30.00 |
| 18. | విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 60.00 |
| 19. | నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 10.00 |
| 20. | మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వ వీచిక) - శ్రీపల్లె సీను | రూ. 26.00 |
| 21. | ఈశ్వర (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 10.00 |
| 22. | సాహితీ గవాక్షం (వ్యాససంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 30.00 |
| 23. | సరయేవోనుండి ఏకశిలకు (అనుసృజన కవితలు) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 30.00 |
| 24. | రాగ పంక్తులు (కవితా సంపుటి) - శ్రీ పల్లె సీను | రూ. 30.00 |
| 25. | ప్రమాది (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 6. | మనోరాగం (కవితా సంపుటి) - శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ | రూ. 30.00 |
| 7. | విక్రమ (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 8. | అవధానవసంతం - డా॥ ఆశావాది ప్రకాశరావు | రూ. 30.00 |
| 9. | వృష (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 30. | నిజాం రాజు అధికారం అంతమొందిన రోజు - శ్రీనందనం కృపాకర్ | రూ. 30.00 |
| 31. | పెరుగుతున్న కాలుష్యం-తరుగుతున్న ఆయుష్యం - శ్రీనందనం కృపాకర్ | రూ. 40.00 |
| 32. | శ్రీలేఖ (కథా సంకలనము) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 60.00 |
| 33. | ఉషస్సు (కవితలు) - యం. నరేందర్ రెడ్డి | రూ. 20.00 |
| 34. | విహంగవీక్షణ (సమీక్షలు) - ఎమ్మెస్సార్ | రూ. 20.00 |
| 35. | దోస్తానా (కథలు) - వరిగొండ కాంతారావు | రూ. 50-00 |
| 36. | కాలం వెంట నడిచి వస్తున్న...(నమిలికొండ అభినందన సంచిక)-డా॥టి. శ్రీరంగస్వామి(సం.) | రూ. 40.00 |
| 37. | చిత్రభాను (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 40.00 |

## ఈ సంచిక క్రమం...

1. జీవనరేఖలు ........................................ 6

2. సాహిత్య రేఖలు .................... డా॥ టి. శ్రీరంగస్వామి .................... 7

3. వర్ధమాన యువకవి .................... డా॥ టి. శ్రీరంగస్వామి .................... 11

(జనధర్మ 21-12-1980 నుండి పునర్ముద్రితం)

4. నయా భావాల భాస్వరం .................... పల్లేరు వీరస్వామి .................... 15

5. తెలుగు వైతాళికుల తత్వాలు .................... శ్రీదాస్యం లక్ష్మయ్య .................... 19

6. ఒక వినూత్న యత్నం .................... నందనం కృపాకర్ .................... 22

7. బాలార్కబింబం .................... పల్లె సీను .................... 27

8. పిట్ట కొంచెం-కూత ఘనం .................... ఎమ్మెస్సార్ .................... 31

9. సందేశాత్మక సహజకవి .................... డా॥ పి.వి. రమణ .................... 34

10. నమిలికొండ అక్షరాల లొల్లి .................... డా॥ వి. వీరాచారి .................... 37

11. కాలం వెంట నడిచే కవి .................... అనిశెట్టి రజిత .................... 41

12. ఆశీః .................... ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు .. 44

* * *

కదలికలను మరువకు

(అముద్రిత రచన) .................... నమిలికొండ బాలకిషన్‌రావు .......... 46

# నమిలికొండ బాలకిషన్‌రావు జీవనరేఖలు

జననం : 06-09-1950, పూడూరు, కరీంనగర్ జిల్లా

తల్లిదండ్రులు : శ్రీమతి రత్నాబాయి, శ్రీనారాయణరావు

విద్యార్హతలు : యం.ఏ., యల్.యల్.బి.,

వృత్తి : అడ్వకేట్, రిజిస్ట్రేషన్ వ్యవహారాలు

సహధర్మచారిణి : శ్రీమతి గోకులరాణి

సంతానం : శ్రీమతి కవితాభరద్వాజ్, పాంచాలరాయ్, హరిత

రచనలు : యువస్వరం (కవితాసంపుటి) 1981
అక్షరచిత్రాలు (సాహితీ మిత్రులపై కవితా చిత్రాలు) 1986
శాంతి-సమత (కవితాసంపుటి) 1989
అక్షరాల్లో అనంతం (కవితాసంపుటి) 1990

సంపాదకుడు : ప్రసారిక (ఆధునిక సాహిత్య వేదిక) మాసపత్రిక 1982 నుండి
మావిరసం (కవితా సంకలనం) 1990
"నివాళి" కాళోజి రామేశ్వరరావుగారి స్మృతి సంచిక, 1997
సుక్కపొడుపు (ప్రసారిక ప్రత్యేక సంచిక) 2002

: అధ్యక్షుడు, సాహితీ సమితి, వరంగల్లు అనేక సంస్థలలో భాగస్వామ్యం

: "యువస్వరం" కవితా సంపుటిపై 12గురు రాసిన వ్యాసాల సమాహారం "నమిలికొండ బాలకిషన్‌రావు - కవితాదర్పణం" - టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో

: "శాంతి-సమత" కవితా సంపుటి - డా॥ రేగులపాటి మాధవరావు గారు హిందీలోకి "శాంతి-సమత" పేరుతో అనువాదం చేసినారు.

: కొన్ని కవితలు శ్రీ షరీఫ్ ఇమామ్ గారిచే ఉర్దూలోకి అనువాదం.

చిరునామా : ఇ.నెం. 6-7-61, రాగన్నదర్వాజ, హన్మకొండ,
వరంగల్లు - 506 011 ఫోన్ : 447407

# సాహిత్య రేఖలు

- డా॥ టి. శ్రీరంగస్వామి

వరంగల్లు సాహిత్య ప్రపంచంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వము కలవాడు నమిలికొండ బాలకిషన్‌రావు. వరంగల్లులో ఏ సాహిత్య కార్యక్రమము చేపట్టినా, ఆ కార్యక్రమము గురించి అతనితో సంప్రదిస్తే తనవంతు కర్తృత్వమును అందించడమునకు ఏమాత్రము వెనుకాడడు. జీవనములో తనయొక్క అభిరుచిని సార్థకము చేసుకునేటందుకు ప్రయత్నిస్తాడు. ఆ కార్యక్రమము దిగ్విజయము అవడానికి సహకరిస్తాడు. అందుకే వరంగల్లులో ప్రతి సాహిత్య సదస్సుతో ఆయనకు అవినాభావ సంబంధమున్నది. 1969లో తొలి కవిత అచ్చులో పురుడు పోసుకొన్ననాటి నుంచి తన సాహితీ తపస్సును నిర్విఘ్నంగా సాగిస్తూనే ఉన్నాడు. జగిత్యాల కళాశాలలో ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు గారి శిష్యరికమును ఇప్పటికీ చెప్పుకుంటూనే ఉంటాడు. 1970 దశకములో వరంగల్లుకు వచ్చినప్పటినుండి తన సాహితీ తపనను తీర్చుకొనే దిశగా ప్రయాణము చేస్తూనే ఉన్నాడు. వరంగల్లు నుండి వెలువడుతున్న 'జనధర్మ' పత్రిక ద్వారా పరిచయము అయిన కవులు ఎందరో ! ఆ వేదిక ద్వారా తన గొంతును స్థిరపరచుకున్న వారిలో శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు కూడా ఒకరు (ఈ వ్యాస రచయిత కూడా).

1979 సంవత్సరములో ఏర్పడిన "చైతన్య సాహితి"ద్వారా సాహితీ సంస్థల గమనములో పాలుపంచుకొని ప్రయాణమును ప్రారంభించాడు. ఆ సంస్థ వెలువరించిన రెండు పుస్తకాల ప్రచురణలో తనవంతు చేయూతను అందించిన సౌమ్యుడు. 'చైతన్య సాహితీ' ప్రచురించిన ప్రత్యేక సంచికకు ఆయన సంపాదకుడు కూడా. 1980 సంవత్సరములో సాంస్కృతీ సమాఖ్య, వరంగల్లు విభాగమును వరంగల్లులో ఏర్పరచినపుడు, దానికి అధ్యక్ష, కార్యదర్శులుగా నమిలికొండ బాలకిషన్‌రావు, టి. శ్రీరంగస్వామి బాధ్యతను తీసుకొని అనేక కార్యక్రమములు నిర్వహించారు. 1981 నవంబరులో అమలాపురంలో సాంస్కృతీ సమాఖ్య రాష్ట్ర మహాసభలు జరిగినప్పుడు తన "యువస్వరం"ను వినిపించాడు. అది తొలి కవితాసంపుటి. ఆ కాలంలో పదిరోజులలో కవితా సంపుటి అచ్చులో పురుడు పోసుకోవడం అపురూపమేమరి. అమలాపురం సభలు ఒక విధంగా సాహిత్య భావనలకు నూతనోత్తేజము ను కల్పించింది. ఆ ఉత్తేజము నమిలికొండ బాలకిషన్‌రావుచే "ప్రసారిక" ఆధునిక

సాహిత్యవేదిక అనే పత్రికను 1982లో ప్రారంభించేలా చేసినది. ఆ పత్రిక అనేక ఆధునిక భావనలకు ప్రోది అయినది. ఎంతోమంది యువకవులకు, రచయితలకు వేదిక అయినది. 'ప్రసారిక' కేవలం ఒక పత్రికయే కాదు అభ్యుదయ భావాల "ప్రసార" ఉద్యమము కూడా. అది అనేక జీవిత చిత్రాలను అందించింది. ప్రసారిక భారతదేశ తెలుగు సాహిత్య అభిమానులకు ఆత్మీయమైనది. ఒక దశలో తెలుగు విభాగమున్న ఏ విశ్వవిద్యాలయానికి వెళ్ళినా వరంగల్లు నుండి ఎవరు వెళ్ళినా ముందుగా 'ప్రసారిక'ను గురించి అడిగే వారంటే అతిశయోక్తికాదు. ఆయన సంపాదకుడుగా ఒక ఉచితమైన స్థానాన్ని అలంకరించాడని చెప్పడమునకు ఈ ఉదంతాలు చాలు. 1982, 1983లలో వరంగల్లు నందు రాష్ట్రస్థాయి రచయిత(త్రు)ల మహాసభల నిర్వహణలో ఆయన పాత్ర మరువలేనిది. అంతేకాకుండా పదునెనిమిది నెలలు నిరాఘాటంగా నిర్వహించిన సాహిత్య అధ్యయన తరగతులు కూడా మరువలేనివి.

1984 సంవత్సరములో "సాహితీ సమితి"ని (నమిలికొండ బాలకిషన్‌రావు అధ్యక్షుడిగాను, టి. శ్రీరంగస్వామి ప్రధానకార్యదర్శిగాను) స్థాపించిన నాటి నుండి దానిని నేటి వరకు దిగ్విజయంగా నడుపుతున్నాడు. ఆ సంస్థ అదే సంవత్సరములో మొదటి కవితా సంపుటి "మధుర"ను వెలువరించింది 'మధుర'కర్త టి. శ్రీరంగస్వామి సాహితీ సమితి అధ్యక్షుడుగా విశిష్టమైన బాధ్యతను నిర్వహిస్తున్నారు. మిత్రులు శ్రీ తాళ్ళపల్లి రామస్వామిగారి ప్రోత్సాహముతో 1983లో ప్రారంభించిన "భాగ్య అవార్డు ఫౌండేషన్"కు అధ్యక్షుడుగా శ్రీ ఎ. సూర్యప్రకాశ్ గారి "కాగితం పువ్వు"కు అవార్డు ఇవ్వడం జరిగింది.

1985లో బాలకిషన్‌రావు గారి "యువస్వరం" కవితాసంపుటిలోని కవితలపై విశ్లేషణ చేస్తూ 12గురు రాసిన వ్యాసాల సమాహారమే "నమిలికొండ బాలకిషన్‌రావు కవితా దర్పణము" ఇది టి. శ్రీరంగస్వామి సంపాదకత్వములో వచ్చినది. ఈ పుస్తకమును మిత్రులు శ్రీ కాట్రగడ్డ (ఏలూరు) గారు ఆవిష్కరణ చేసారు.

నమిలికొండ బాలకిషన్‌రావు కేవలం తను ఫలానా సాహిత్య సంస్థకు అధ్యక్షుడిని, కార్యదర్శిని, ఆ సంస్థ పనే చేయాలనే ఆలోచన లేకుండా ఇతర సాహితి సంస్థలకు సహకరిస్తున్నాడు. ఆయనకు సరియైన ప్రాధాన్యతను ఇచ్చారా, లేదా అనే విషయమును ఎప్పుడు పట్టించుకున్నట్టుగా కనపడడు. ఎందుకంటే ఆ విషయమును ఆయా వ్యక్తులకు మాత్రమే వదిలిపెట్టాడు అని భావించవచ్చును. ఎందరో రచయితలకు, వారి సంకలనాల వెలుగుకు చేయూతను అందించినాడు. వరంగల్లులో ఏ సాహిత్య కార్యక్రమము జరిగినా అడిగిన

వారికి లేదనకుండా తనవంతు చేయూతను అందిస్తూనే ఉన్నారు. 1986లో జానపద సాహిత్య పరిషత్, వరంగల్లు శాఖకు ఉపాధ్యక్షుడిగా కొనసాగారు. పోతన విజ్ఞాన పీఠం, వరంగల్లు, కోవెల సంపత్కుమార షష్ఠిపూర్తి ఆహ్వానసంఘమునకు కార్యవర్గసభ్యత్వమును తీసుకొని వాటి దిగ్విజయమునకు పాలుపంచుకొనినాడు. కాళోజీ రామేశ్వరరావు సహస్ర చంద్ర దర్శన కార్యక్రమములకు ఊతను ఇచ్చినారు.

1987లో "అక్షర చిత్రాలు" అను నాలుగు పంక్తుల కవితా చిత్రాల పుస్తకమును అందించినాడు. ఇది సాహితీ మిత్రుల వ్యక్తిత్వ చిత్రణను, వారి ప్రవృత్తులను ప్రతిబింబించేదిగా ఉంది. ఇది నాలుగు పంక్తుల చిత్రణాచిత్రము. కవుల, రచయితల యొక్క ప్రవృత్తులను ఇందులో అల్పాక్షరాలలో అనర్ఘమైన భావాలను, అద్భుతమైన రచయితల వ్యక్తిత్వమును మలిచారు. ఎందుకంటే మనమెరిగిన సాహిత్యమూర్తులను తన వాక్చిత్రాలలో, కవితాఖండికలలో నిబద్ధీకరించారు. 1987లో ఇదొక కొత్త ప్రక్రియగా రూపుదిద్దుకుంది. ఈ ఒరవడిలో తదుపరి కాలములో అనేకమైన వాక్చిత్రాలు వచ్చినవి. 1988లో "శాంతి-సమత" అను కవితా సంపుటిని వెలువరించినారు. ఇవి హిందీలోకి అనువర్తితము అయిన కవితలు. ఆ తదుపరి జనవరి, 1989లో తెలుగు కవితల పుస్తకము "శాంతి-సమత" పేరుతో వెలికి వచ్చినది. సాధారణంగా ముందుగా మాతృభాషలోను, తరువాత ఇతర భాషలో వెలువడడం జరుగుతుంది. కాని ఇక్కడ వ్యతిరేకము అయినది. బాలకిషన్‌రావు ఎవరు వచ్చి ఏ సాహిత్య కార్యక్రమము చేపట్టినా అందుకు సరియైన ప్రోత్సాహము ఇస్తారు. అందు వలననే కాబోలు హిందీ అనువర్తితం ముందుగా వచ్చినది.

1980వ దశకము అనేక కవులను ప్రభావితము చేసి మినీ కవితా ప్రభంజనములో తలమునకలు చేసినది, కొంత సాధనను నేర్పినది. మరికొంత కవితామయము చేసినది. ఆయా కవుల కవితాభిరుచిని ప్రకాశవంతము చేసినది. ఆ సాధన మార్గములో వచ్చినదే "అక్షరాల్లో అనంతం"అను కవితా సంపుటి. ఈ సంపుటి 1990 సంవత్సరములో వెలుగు చూసినది. ఇందులోని మినీ కవితలు సూటిగాను, స్పష్టంగానూ ఉన్నవి. 'దివిటీ', 'స్వరమాలిక' శ్రీలేఖ సాహితి ప్రచురించిన ఉగాది కవితా సంకలనాలలో వీరి కవితలు చోటు చేసుకొనినవి. కాళోజీ రామేశ్వరరావు గారి స్మృత్యర్థం "నివాళి" అను సంచికను 'ప్రసారిక' పబ్లికేషన్స్ ద్వారా వెలువరించారు.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు "మానవ వికాస రచయితల సంఘం"(మావిరసం) ఏర్పరచి వరంగల్లులో దాని శాఖను ప్రారంభించినప్పుడు "మావిరసం" కవితా సంకలనము

న్ను తెలంగాణా రచయితల వేదిక 2002 జనవరిలో "ప్రసారిక" తరపున "సుక్కపొడుపు" అనే ప్రత్యేకసంచికను వెలువరించడంలో వీరి కవితాభినివేశమును, సాహిత్యాభిమానతను గమనించవచ్చును. 2002 ఫిబ్రవరిలో యన్.బి. ఆర్ట్ క్రియేషన్స్ పేరన ఒక భక్తిపాటల క్యాసెట్టును రిలీజ్‌చేసి తన సంగీతాభిరుచిని వెలిబుచ్చారు. జనధర్మ పత్రికలో అనేకమైన వ్యాసాలు, కవితలు రాసారు. ఈయన వ్యాసాలు అన్ని సంపుటీకరించవలసి ఉన్నది. బాలకిషన్‌రావు గారి న్యాయవాద వృత్తి, రిజిస్ట్రేషన్ (డాక్యుమెంటేషన్) వ్యవహారాలలో తల మున్కలు అవుతూనే, సాహిత్యసేవను, కవితలను అందించడం గమనించదగినది. తనకు తెలిసిన వారెవరికైనా అభినందన జరిగినా, సన్మానం అందినా బాలకిషన్‌రావు కూడా స్పందించుతాడు.

బాలకిషన్‌రావు ఎంత సాహిత్య అభిమానో అంత అధ్యాత్మికుడు కూడా ! హవేలి గాయంపేటలోని పాంచాలరాయస్వామి దేవాలయము పునరుద్ధరణలో తన వంతు భాగస్వామ్యమును అందిస్తూనే, తన క్లయింట్స్ ద్వారా ఆ దేవాలయమునకు సేవలందింప జేసారు. రాగన్నదర్వాజ దగ్గరలోగల దేవాలయాలలో ఆయన కమిటీ సభ్యుడు, ఆ దేవాలయాల అభ్యున్నతికి కృషిసల్పుతున్నవాడు.

1982లో జరిగిన పోతన పంచశతి ఉత్సవాల కమిటీలో కార్యవర్గసభ్యుడిగా పాల్గొని తనవంతు కర్తవ్యమును అందించినారు. కాళోజి రామేశ్వరరావు సహస్ర చంద్ర దర్శన సంచిక, 1994లో సంపత్కుమారాచార్య షష్ఠిపూర్తి సంచిక, 1995లో పేర్వారం జగన్నాథం షష్ఠిపూర్తి సంచిక, 1996లో అద్దేపల్లి రామమోహనరావు షష్ఠిపూర్తి సంచిక, విశ్వనాథ అసంకలిత సాహిత్య సంపుటాలు మొదలగునవి వెలువడినప్పుడు తన భాగస్వామ్యమును పంచారు. అంతే కాకుండా సాహితీ సమితి ద్వారా ప్రచురించిన పుస్తకాలకు, వాటి ఆవిష్కరణలకు తన వంతు ఆర్థిక చేయూతను అందించినారు. సహృదయత, వితరణ కుంచించుకు పోతున్న పరిస్థితులలో బాలకిషన్‌రావు యొక్క ఔదార్యతను మనం గమనించవచ్చును.

06-09-1950 నాడు కరీంనగర్ జిల్లా పూడూరులో నారాయణరావు, రత్నాబాయి దంపతులకు బాలకిషన్‌రావు రెండవ కుమారుడిగా జన్మించారు. వీరి అన్న జగన్‌మాధవ రావుగారు కూడా కవే. కవితా వారసత్వమును బాలకిషన్‌రావు గారి పెద్దకూతురు అందు కున్నది. వృత్తిపరముగా తన దగ్గరకు వచ్చే క్లయింట్లకు వారి పని సులభముగా అవుతుందనే నమ్మకము కలిగించినవాడు, నమ్మకస్తుడు అనే ముద్రను వేసుకున్నాడు. ❖

కాలం వెంట నడిచి వస్తున్న...

# వర్ధమాన యువకవి నమిలికొండ బాలకిషన్‌రావు

**- టి. శ్రీరంగస్వామి**

వరంగల్లు నగరం సాహితీ మిత్రులకు, సాహితీ ప్రియులకు పుట్టినిల్లు. సాహితీ రసికులతోపాటు కవులున్నారు, కథకులున్నారు, విద్వాంసులున్నారు, ఇప్పుడిప్పుడే రచనకు శ్రీకారం చుట్టుతున్న యువకవులు ఉన్నారు. ఈ యువకవులను సాహితీ ప్రపంచమునకు పరిచయము చేయడానికి "జనధర్మ"లోని "కవితా" శీర్షిక వేదికగా నిలిచింది. ఈ వేదిక నుంచి కోరస్ గీతంతో వరంగల్ పాఠకులకు, సాహితీ లోకానికి పరిచయము అయినవారు శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు.

వీరిలో జిజ్ఞాస ఉంది, జిగి ఉంది, కవితకు కావలసిన ఆహార్యం ఉంది. ప్రతి కవిత్వం భావప్రకటనకు ప్రతీకగా ఉంటుంది.

*"చేరిన ఆకలిని - చాలని కంబళిని*
*మాడిన డొక్కలని - పదిలంగా వదిలింది ఆత్మ"*

ఈ మినీ కవితలోనున్న వీరి భావపటిమను, శక్తిని, శబ్దాల వెనుకనున్న ప్రతిశబ్దము నిస్సహాయుల, నిరుపేదల స్థితిని ఎంత దయనీయముగా చూపెట్టిందో గ్రహించే ఉంటారనుకొంటాను. ఆ విధంగానే ఆ అభాగ్యుల ఆర్తనాదాలను, రోదనలను, మూగపోయిన ఆశలను "మూగవోయిన మనిషి" అనే ఈ గేయములో ఎలా నిక్షిప్తం చేశాడో చూడండి.

*"అగాధంలోకి తొంగిచూస్తే ..........*
*అతకని బతుకులు*
*ఆకలి చావులు - ఆరడించే అర్ధాంగి డొక్కలగాధ*
*ఆలపించే అబ్బాయిల రొద ....... "*

ఈ ఈతిబాధలను సంఘంలో జరిగే అన్యాయాలను, మోసాలను, అరిష్టాలను చూస్తే వీరిలోని కవితా హృదయం అంతర్మథనం జరిగి "ఆవేదన" చెంది ఈ కవితావేదన ఉదయించిందనుటలో ఏమాత్రం సందేహం లేదు.

"ఓ మనిషి ! .....
నీ జీవితం పగిలిపోయిన నావలాంటిది
దుఃఖాలనే సముద్రంలో - దగా అనే పడవలో
మునిగిన కెరటాలవంటి అనుభవాలతో - జీవితం నిగ్గుదేరుతుంది.
సుఖమనేది నీకు స్వర్గానికి నిచ్చెన సుమా !
బరువైన గుండెతో .....
జీవితాన్ని చీకటిగా మార్చకు
గుండె నిబ్బరము చేసుకుని .....
ఆవేదన విడనాడిన నాడు
ఆకాశమంత ఎదుగుతావు నీవు"

అని అంటూనే పరోక్షంగా ఉండి ఆ సామాన్యున్ని ఉత్తేజపరుస్తున్నాడు.

మన సమాజంలో సంపన్నులు, బీదల మరియు నీతి, అవినీతుల మధ్య జరిగే పోరాటాలను చూసి అతనిలో కలిగిన ఊహే ఈ "గాలిపటం".

"వర్ణము అవర్ణముగా మారి .......... - వేధించిన అవినీతి
వ్యర్థముగా వచ్చిన బీదత్వము - కలిసి సయ్యాటలాడుతూ
కరడుగట్టిన మిగిలిన జనాన్ని - కాలము మ్రింగుతుంటే
నిద్రమత్తును వీడి నేను .... - నిజాయితీతో
నిలకడలేని గాలిపటంలా ఎగురుతున్నాను - పై పైకి......... "

అవసరము లేకున్నా అత్యవసరము అని, సమస్యగా లేని దానిని సమస్యగా తీసుకొని, కాలక్షేపాలకు సమయాన్ని వెచ్చిస్తూ ఇతరుల ముఖ్య అవసరములను తినివేస్తూ 'కట్‌మల్' ల్లా సామాన్యుల హక్కులను భక్షిస్తున్నవాండ్లను చూసినప్పుడు కలిగిన అనుభూతి ఈ విధముగా పలికింది.

"ఆశతో కొందరు - అరగక కొందరు
బట్టలు లేక కొందరు - భలే తమాషాగా యెందరో !
బరువు-భారం మోయలేక బాధ్యతలు విడనాడే వారెందరో,
ఉద్యోగం కావాలని కొందరు - ఊరికే కాలం గడపడానికెందరో ......
విద్యను పెంచేవారు కొందరు - వీధుల వెంబడి తిరిగే వారెందరో
ఊహా సౌధాలెందరకో - ఊహా లోకాలెందరికో"

అని ప్రశ్నిస్తున్నారు. ప్రశ్నించడంతోనే వీరు సరిపుచ్చుకోలేదు. ఆ ఊహాలోకాలు, సౌధాలలోని స్వప్నాలలోకి వెళ్లి, ఆ "కలలు" కొందరికి అనుభవైక నైవేద్యము అవుతాయి మరికొందరికి "కల" కల్లగానే మిగులుతుంది అని అంటారు.

*".............. - ఉద్యోగికి లంచం కల*
*స్త్రీకి మాతృత్వపు కల - మదనునికి భోగ కల*
*దరిద్రుడికీ భోగభాగ్యాల కల - నాయకునికి యంత్రాంగం నిర్వాహక కల*
*నిరుద్యోగికి ఉద్యోగపు కల - ఆపై నిరుత్సాహపు కల"*
అని స్పష్టంగా చెప్పేసారు తమ "కల" కవితలో.

ఆ కలలు కల్లలైనప్పుడు నిరుత్సాహంతో మోడువారి పోకుండా, నిస్సహాయతతో నిలబడిపోకుండా, ఆత్మస్థైర్యముతో మనలో అంతర్లీనముగా ఉన్న అజ్ఞాన తిమిరాన్ని వెలిగించి మనలోని అజ్ఞానాన్ని పారద్రోలుము అని చాటి చెప్పుతున్నాడు ఈ కవితలో...

*"బ్రతుకు బాట మ్రోడుబార లేదు -*
*పరువు విడిచి బాధ్యతలు వదలుకోడు*
*చేదు రసం, చావు ఫలం అని చలించి త్రాగేవు, చావు రాదు*
*రగిలే బాధలను రగలనివ్వకు ........*
*అచ్చమైన మనిషిగా ఆత్మను కాపాడుకో !"*

వీరి కవితలో అన్యాయాలు, అక్రమాలు, అవినీతే కాకుండా భావుకతనిండిన కవితాత్మ కూడా ఉంది అనుటకు ఎదురేగి ఆహ్వానిస్తున్నారు.

*"వసంతాల లతాకుంజరాలతో - వీచే పిల్లగాలుల తరంగాలలో*
*స్వాగతం చెప్పుదాము - ఒక్కసారి మా గృహాలను పావనం చేయగ రండి*
*మా వనంలోని పువ్వుల మకరందాల పాయసాలను*
*మంచి రుచిగల్గిన ఆనాటి శబరి రుచిచూచిన పండ్లను*
*మీ కొరకై విందు చేస్తాం - మధురమైన కోకిల గానము*
*సీతాకోక శృంగార నృత్య భంగిమలను ఇంపుగా గావించి*
*మధురమైన నిద్ర మత్తులో నింపుతాము"*

అని మనకు చెప్పుతూనే తన కలము ఎలాంటి ఆశయాలతో ఉంది అని "నా పాళీ" అను కవితలో ఇలా చెప్పుతున్నారు.

*"మనిషిలోని ఆత్మ మనుగడకు దూరమైంది*
*ఆత్మను కదిలించిన - ఆగిన "పెండ్యూలమ్" ఐంది*
*............ - అరచేతి బలం అమాంతం నిగ్గు రాసింది*
*యీ నా ఊహా సౌధం - పై మెట్టుకు శాంతి కావాలని*
*యీ నా కవిత ఒక మెట్టునివ్వాలని - కోరుకుంది నా కలం పాళీ"*

అని తన పాళీలోంచి వచ్చిన కవితా ప్రవంతిని ఇతరులకు పంచి ఇస్తూనే, కవితాత్మకం గానే కాకుండా సాహితీ మిత్రులను, తను నమ్ముకున్న ఆత్మీయులను ఆదరించే సహజ సిద్ధమైన స్వభావము వీరిది. అయినప్పటికిని తనకున్న స్వేచ్ఛను, ఇతరుల స్వేచ్ఛను అవసరమున్నంత వరకు మాత్రమే ఉపయోగించుకోవాలని అంటారు.

*"పిన్నలు పెద్దలుగా పనులు చేయాలి - సుఖాల లోకాలు మరో లోకముతో*
*ఉన్నా... లేకున్నా.... సత్యాన్ని, సందేశాన్ని - సంప్రదాయాల వేదాల్ని*
*సరియైన పద్ధతుల్లో అనుసరిద్దాం, ఆచరిద్దాం"*

అనే ధర్మానికి కట్టుబడే వీరు పాంచాల రాయస్వామి ధర్మకర్తలలో ఒకరై ఆ దేవాలయమునకు ఇతోధిక సేవ చేస్తూ ఇలా వక్కాణిస్తున్నారు.

*"పాంచాల రాయా పాలించరావా -*
*పామరులను కాపాడే పరమాత్ముడ నీవేనయ్యా*
*" ................ " - శతకాలపు ఆలయాన్ని కాపాడ రా రావయ్యా"*

అని సనాతన ధర్మములకు కూడా ప్రతినిధి అయి నిలిచారు.

వీరు వృత్తిరీత్యా న్యాయవాదులు అయినప్పటికిని ప్రవృత్తి రీత్యా సాహితీ క్షేత్రములో కృషి చేస్తున్నారు. సాంస్కృతీ సమాఖ్య (యువ సాహితీ వికాస వేదిక) విజయవాడ నిర్వహించు ఆంధ్రప్రదేశ్ ఆహ్వాన సంఘం 1980-83నకు వారు ఉపాధ్యక్షులు, వరంగల్ విభాగమునకు అధ్యక్షులు, సాహితీ క్షేత్రమనే కవితా వ్యవసాయములో మరిన్ని మంచి ప్రయోగాలు చేసి లబ్ధప్రతిష్టులై, సాహితీ వికాసంలో ధృవతార అవుతారని ఆశిద్దాము. ❖

*(జనధర్మ 21-12-1980 నుండి పునర్ముద్రితం)*

# "నబారా యువస్వరం-నయా భావాల భాస్వరం"

## - పల్లేరు వీరస్వామి

ఆశావాదులూ, నిరాశావాదులూ లోకంలో రెండు వర్గాలుగా ఉంటారు. సాహిత్యం లోనూ ఈ విభజన సర్వసాధారణమే. ఆశావాదులు నిరంతరం భవిష్యత్తుకై బంగారు కలల్ని కంటారు. అందుకు నవీన మార్గాల్ని సృజిస్తారు. నిరాశావాదులు, జీవనంలో ఎదురు దెబ్బలు తిని నిరాశా నిస్పృహలతో కొట్టుమిట్టాడుతూ, తామున్నచోటనే ఉంటారు, లేకుంటే తిరోగమనం చేస్తారు. జాతి శ్రేయస్సు దృష్ట్యా యువతకు ఆశావాదమే వాంఛనీయం. ఔత్సాహికతతోపాటు సమస్యలపట్ల సరైన దశానిర్దేశం చేయు సామర్థ్యం యువ కవులలో వెల్లివిరియాలి. అందుకే షెల్లీ మహాకవి *"ఉద్రేకం, ఉత్సాహం, భావ గాఢతలతో నిండి ఉన్నదే ఉత్తమ కవిత్వం"*గా పేర్కొన్నారు.

*"యువతరం శిరమెత్తితే - నవతరం గళమెత్తితే*
*ఈ లోకమే మారిపోదా - పెనుచీకటే మాసిపోదా"*

అంటూ యువతపై పెను ఆశల్ని పెంచుకున్నాడు గజ్జెల మల్లారెడ్డి, సామాజికంగా యువత నిర్వీర్యమైపోతే జాతి నిర్వీర్యమౌతుంది కదా ! అందుకే యువత పెడదోవ పట్టక, తనవంతు సామాజిక బాధ్యతను చక్కగా నెరవేర్చగలగాలి. కలంపట్టిన యువకవులు నిరంతర అధ్యయనశీలురై, తమ కలాల్ని ప్రగతి కోసం, తమ స్వరాల్ని నిద్రాణమై ఉన్న జాతిని మేల్కొలుపుట కోసం వినియోగించగలగాలి.

నబారాగా పేరుగాంచిన శ్రీనమిలికొండ బాలకిషన్‌రావు గారు 1981లో 47 కవితలతో "యువస్వరం" పేరిట తన తొలి కవితా సంపుటిని వెలువరించారు. మొదటి ప్రయత్నం లోనే కొన్ని ప్రాణవంతమైన కవితా పంక్తుల్ని ఒలికించి సెహబాసనిపించుకొన్న నబారా కవితా శక్తిని, ఆసక్తిని రేఖామాత్రంగా చూపించడమే ఈ వ్యాసోద్దేశం.

బాలకిషనుడు కవితారంగంలో తడబడిన అడుగులతో నడయాడినా, తను నూతనత్వం కోసం, చేతనత్వం కోసం పడిన ఆరాటం, విశ్వజనీన హృదయపూర్వక వినూత్న భావాలతో వారి ఆలోచనలు యువస్వరంలో దృగ్గోచరమవుతాయి.

తొలి కవితా సంపుటిలోని తొట్టతొలి కవితా శీర్షిక "జ్వాలను వెలిగించు!!" 'చ ఆవరించియున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎం దీపాన్నైనా వెలిగించు' అన్న వాక్కులకు అనుగుణంగా ఈ పేరు పెట్టాడేమో, ప్రకటించబోయే కవితా దీప్తులకు "యువస్వరం" భాస్వరం అవుతుందేమో !

ఆదిలోనే ఆయన రాసిన పంక్తి "బ్రతుకు బాట మోడుబారలేదు" ఎంతటి ఆ కవితా పథికుడో తన ముందడుగులోనే సూచించబడింది. "బరువు విడిచి బా వదలుకోకు" అంటూ ప్రబోధిస్తూ ప్రస్థానం ప్రారంభిస్తాడు. నిరాశాజనక మార్గంవైప ఆశాపూరిత దారివైపు సమాజ గమనాన్ని మళ్ళింపజూస్తాడు. ఆవరించిన తివి జయించుటకు, చిరుదివ్వెనైనా వెలిగించి, ఆ "వెలుగున్న దారిలో - దగాకో ధనవంతులు - దరిద్రుల రక్తాన్ని పీల్చేవారిని - తరిమి తరిమి వేటాడు" అంటాడు. హితాన్ని ఆకాంక్షించని "కరడుగట్టిన గుండెల్ని చీల్చి - నవనీతాన్ని పిండు" అం మనిషి మనీషిగా బ్రతుకుటకై ప్రయత్నించాలి. అందుకు దేబెతనం, దేహితనం పని అందుకే "అచ్చమైన మనిషిగా - ఆత్మను కాపాడుకో" అని కర్తవ్య బోధన చేస్తాడు.

మరోచోట "చీకటనే అసత్యాన్ని - చురకత్తివంటి నిజాన్ని" ఇలా అలతి పదాలతో చక్కని ప్రతీకల్ని సృజిస్తాడు "అవినీతి అధికారులను - అమాంతం గద్దె ది వెలుతురనే సత్యానికి - వేయి చేతులు కలిపి - పునాది వేద్దాం" రండని పిలుపి అప్పటి నుండి ఇప్పటికీ భరతఖండంబు చక్కటి పాడియావుగానే భావిస్తాడు. అ "పుష్కలమైన దేశ సంపదను - పదిమందికీ పంచుదాం" అంటూ సోషలిజ స్థాపనకై పడతాడు. అప్పుడు మాత్రమే ఈ దేశం "పవిత్ర దేశంగా చాటుదామని" ప్రబోధిస్తాడ

ఉత్తమ కవిత్వం ఫోటోగ్రఫీవలె పై పై విషయాలనేకాక సమస్యల లోతుల్ని గలగాలి. నబారా 'టిప్'అనే అల్ప విషయాన్ని వినియోగించుకొని, ఎన్నో సావ అంశాలను జోడిస్తాడు. ఉదాహరణకు నేడు మితిమీరుతున్న వరకట్న దురాచా ప్రస్తావిస్తూ "వరునికి వధువు ఇవ్వాలి టిప్" అంటూ వెక్కిరిస్తాడు.

"తన సంతోషమె స్వర్గము - తన దుఃఖమె నరకమండ్రు తథ్యము" అన్నాడు సు శతకకారుడు, అట్లే నబారా కూడ "ఆవేదన విడనాడిన నాడు - ఎదుగుతావు నీవే ఎ మంత" అంటూ వేదన మనిషిని క్రుంగదీస్తుందని, అది విడనాడితే మనిషి మహనీయు తాడనే సత్యాన్ని విశదీకరిస్తాడు.

## కాలం వెంట నడిచి వస్తున్న...

"అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా - కుక్కపిల్లా అన్నీ కవితామయమే"అని శ్రీశ్రీ అంటే నబారా కూడా తన కవితల్లో మచ్చర్‌ను, కట్‌మల్‌ను కూడా కవితామయం చేసాడు. మనిషి రక్తాన్ని పీల్చే జీవుల్ని, సమాజాన్ని పీడించే పీడకులుగా పోల్చి అధిక్షేపిస్తాడు.

నేటి మనిషి విశ్వాంతరాళాల్లో విహారం చేస్తున్నాడు. అందుకు గర్వించదగిందే, అయితే సాటి మనిషిని, మానవతను మరిచిపోతున్నాడు. నిస్సహాయులకు చేయూతనీయడం మానవత. ఆ మానవత కోసం తపించిన కవి నబారా. అతడు మానవత కోసం ఎంతో గాలించాడు. అతనికి సుదూరంగా దొరికిన చిరునామాను ఈ విధంగా క్లుప్తీకరించాడు *"అగాధంలోకి తొంగి చూస్తే - అగుపించేది నీకు - మానవత-"*.

మనిషిలోని మానవత మంటగలిసి, ఆదర్శాలను అడుసుత్రొక్కి, మోసం, దగా, కుట్ర, వంచనలతో వీరవిహారం చేస్తున్న వర్గాన్ని ఆగ్రహిస్తాడు. పీడితులనూ, తాడితులనూ, కష్ట జీవులనూ చూసి జాలిపడ్తాడు. వాళ్ళ జీవితాల్ని తన ఎక్స్‌రే కళ్ళతో లోకానికి చూపుతాడు. రిక్షావాలానుద్దేశించి చెబుతూ *"కాళ్ళతో బిగబట్టుతూ - కన్నులతో నిగ్గజూస్తూ - పడిలేస్తూ - తలను త్రిప్పుతూ - పైసా దొరికే ఆశతో - పరుగెత్తింప జేస్తున్నాడు"* ఎంతటి వాస్తవ చిత్రీకరణ, రసార్ద్ర హృదయులెవరైనా పై వాక్యాల్ని చదివి జాలినొందకపోతే వారు మనుషులే కారు. అలా ఆ కష్టజీవి కష్టించకుంటే, అతని జీవనానికి మరో మార్గమే లేదు కదా ! అందుకేనేమో *"పిక్కబలం తగ్గిందా - డొక్క డొల్లుకు పోయింది"*అంటూ వాపోతాడు. ఎంత భారమైనా, కష్టానికి వెరవక పనిచేద్దామన్నా *"నిలబడి సవారికి వేసారి - చివరికి 'బ్రష్ట్' ఐన టైరును - భద్రంగా అతుక్కుంటున్నాడు - మళ్ళీ మళ్ళీ ....."* ఇదే ఆ బాధితుని నిరంతర వేదన. కవి తాను వ్యక్తిగా స్పందించడం, సమాజానికి చాటి చెప్పడం తన బాధ్యత నెరవేర్చినట్లయింది.

"వార్తలు"అన్న కవితలో సమాజంలోని నిత్యసత్యాలను వల్లెవేస్తాడు. ఈ సమాజం అసమానతలతో ఇలాగే ఉన్నన్ని రోజులు ఈనాడూ ఏనాడూ వార్తలు మామూలుగానే ఉంటాయంటూ అభివ్యక్తపరుస్తాడు.

యువస్వరం ఒలికించిన తీరు సూటిగా స్పష్టంగా ఉంది. నబారా 'స్వేచ్ఛ' అనేది అభాసుపాలైనట్లు గుర్తిస్తాడు. పాలకవర్గాలు, అధికార యంత్రాంగం బాధ్యతల్ని మరచిందంటాడు. అందుకే *"స్వేచ్ఛ అనే వస్తువు - అమాంతం బూడిదగా మారింది"*

అంటూ వ్యాకులపడతాడు. అందుకే *"బీద ప్రజల నోట్లో మట్టికొట్టి"* ఉన్న వైనాన్ని ఖండిస్తాడు. పరిష్కారమార్గంగా యువకులకు సందేశమిస్తాడిలా *"సామ్యవాదం నెలకొల్పి - సమతకు పునాదివేసి - సాగవోయి నవయువకా !"* అంటూ కర్తవ్య ప్రబోధం చేస్తాడు. ఏ దేశంలో కూడా లేని కులతంత్రాలను కూలదన్నాలంటాడు. కులానికి సమాధికట్టే యత్నంలో భాగంగా *"వర్ణాంతర వివాహాలను - వంతులు వంతులుగా చేద్దా"*మంటాడు. అలా *"కులాల జాబితాను తుడిచేయా"*లంటాడు.

మనిషి, ప్రభుత్వం, సమాజం ఇంకా ఏవైనా కోరుకునేది కూడు, గూడు, గుడ్డ మాత్రమే. వీటిని అందరికీ సమంగా అందేలా చేస్తే అదే లోక కళ్యాణం. నబారా తన చివరి కవిత "ఆత్మ"లో చాలా తక్కువ మాటల్లో మనిషి బ్రతుక్కి కావల్సిన పై నిత్యావసరాల్ని ధ్వనీకరిస్తాడిలా *"చేరిన ఆకలిని - చాలని కంబళిని - మాడిన డొక్కలని - వదిలంగా వదిలింది ఆత్మ"* కండగల మాటల్ని రాసిన నమిలికొండ తను చేయి తిరిగిన కవిగా నిరూపించుకొన్నాడు. ఒకే ఒక్క సిరాచుక్క వేయి మెదళ్ళను కదిలించినట్లయింది. ఆదర్శ మానవ సమాజం కోసం, సౌభ్రాతృత్వ భావన వెల్లివిరిసేకోసం, మొత్తంగా మానవ వికాస పరిణామం కోసం, పరుగెత్తి ప్రబోధించే తత్త్వం - నబారా కవిత్వం. ❖

# తెలుగు వైతాళికుల తత్వాలు 'అక్షర చిత్రాలు'

- శ్రీదాస్యం లక్ష్మయ్య

సామాజిక ప్రయోజనాన్ని కలిగించేదే సాహిత్యం. ఎంచుకున్న ప్రక్రియ ఏదైనా చెప్పదలచుకున్న భావాన్ని సూటిగా, తమదైన దీతిలో చెబుతూ తమ కలాల్ని నడిపిస్తున్న వారెందరో ఉన్నారు. గ్లోబలైజేషన్ పుణ్యమా అని ఇప్పుడు ప్రపంచ సాహిత్యం ఔపోసన పట్టడం సులువైపోయింది. డిజిటల్ ప్రపంచంలో కాలూనిన నేటి సాహిత్యం మన పరిసరాలని స్పృశించలేని తన్మయత్వంలో పడిపోతుండటం అత్యంత బాధాకరమైన విషయం. అయితే అప్పుడప్పుడు మనల్ని మనంగా గుర్తుకు తెస్తూ, మన స్థితిని, మన విధిని తట్టిలేపుతున్న సంస్థలు, సందర్భాలు లేకపోలేదు.

నేడు విస్తృతంగా విభిన్న భాషల్లో వెలువడుతున్న సాహిత్యాన్ని, సాహిత్యకారుల్ని మనం తెలుసుకోలేకపోతున్నాం. మన కళ్ళముందే ఎన్నో ప్రక్రియలు, ప్రయోగాలు ఇలావచ్చి అలా వెళ్ళిపోతున్నాయి. తెలుగు సాహిత్యంలో నిశ్శబ్దం చోటుచేసుకున్న సందర్భాలు అరుదనే చెప్పవచ్చు. అస్పష్టమైన దృక్పథాలు వ్యక్తం చేసిన సందర్భాలు, ప్రవాహంలా సాగిన సందర్భాలు గోచరిస్తాయి. ఆయాకాలాలలో ఆవిష్కరించబడిన సాహిత్యం ఇన్స్పిరేషన్ కాలక్రమంలో ఎన్నో మార్పులకు గురవుతూనే ఉంది. ఈ ఆటుపోటుల మధ్య సాహిత్యం- సాహిత్యకారులు సమాజ స్థితిగతులు వేటినీ విడదీయలేం. దానికి ఒక కాలమానం కావాలి. అందుకు ఒక సాధనం కావాలి. అది చూడగలిగే సృజనాత్మకత మనలో ఉండాలి.

'ప్రసారిక' సంపాదకుడు నమిలికొండ బాలకిషన్‌రావు 'అక్షరచిత్రాలు' వైతాళికుల తత్వాలుగా పేర్కొనవచ్చు. సులభంగా అర్థమయ్యే రీతిలో నాలుగైదు వరుసలలో ఒక్కొక్క కవిని గురించి వర్ణిస్తూ వందలాదిమందిని ఈ చిన్ని పొత్తంలోచేర్చడం అద్భుత ప్రయోగంగా పేర్కొనవచ్చు. కొందరు సాహిత్యకారులకు వీరువాడిన ప్రతీకలు ఆయా వ్యక్తుల ప్రాధాన్యాల్ని, వస్తురీత్యా సముచితమనే భావన కలుగుతుంది. కొన్ని పదాలు చదివితే కొత్త అర్థాలు స్ఫురింపచేయగలవని మనం భావిస్తాము.

సాహితీ వైతాళికులను గురించి సందర్భోచితంగా వ్యాఖ్యాన సహితంగా ప్రతికృతి చేయడం, దానిని కవిత్వరూపంలో అక్షరీకరించడం అనేది ఒక అరుదైన విషయం.

అలాంటి అరుదైన అంశాన్ని చేపట్టి విశిష్టరీతిలో నూటాయాభై పైచిలుకు వైతాళికుల చరిత్రని మూడుముక్కల్లో వ్యాఖ్యానించే అక్షరయజ్ఞంతో కవితాక్షర మాలలల్లి అక్షర చిత్రాలుగా ఆవిష్కరించారు నమిలికొండ బాలకిషన్‌రావు. ఎవరూ ముట్టుకోని వస్తువును తాను చేపట్టి అక్షరబద్ధంచేసి తన సత్తా చాటిన 'నబారా'ను, ఇందుకు ప్రేరేపించిన కవి మిత్రులను అభినందించదగ్గ విషయం.

ఇందులో అక్షరీకరించబడిన ఆయా కవుల, రచయితల రచనలను బాగా అధ్యయనం చేసి, సునిశితంగా పరిశీలన చేసి, ఆలోచనాత్మకంగా స్పందించి, అక్కడ కూడా ఆయా వ్యక్తులపై ప్రచారంలో ఉన్న వ్యవహరాల్ని, మాటల్ని ప్రయోగిస్తూ కవిత్వం కొనసాగించారు. ఇది నిరంతరంగా అధ్యయనం చేస్తే తప్ప రాయగలగడం సాధ్యంకాని అంశం. రచనల ద్వారా ఆయా రైటర్‌ల సైకాలజీని నోటిఫై చేసి తన దక్షతను నిరూపించుకున్న కవి నమిలికొండ బాలకిషన్‌రావు. తన పోయెటిక్ వాయిస్‌లో ఎక్కడా ఎవరి సాహిత్యాన్ని కడిగేయకుండా సంక్లిష్టమైన భావజాలానికి తావీయకుండా జాగ్రత్త పడ్డాడు.

సాహిత్య పూదండలని, విశారదులని, సర్వదా సాహిత్య గుబాళింపులను నింపిన వైతాళికుల నుండి, తెలుగు పుటల్లో చిరస్థాయిగా వెలుగొందిన వారిని, తెలుగు సాహిత్య సంక్రాంతి శోభల్ని వెదజల్లిన వారిని, యుగపురుషులని, సాహిత్య చెలియలికట్టని, కొత్త కలాలని, ఏకకాలంలో స్పృశించిన కవి 'నబారా'.

'ఆంధ్రా వర్డ్స్‌వర్త్' నుండి అప్పుడే కలంపట్టిన యువకవులవరకు తెలుగు సాహిత్యంలో నిలువదగిన స్థాయిలో రచనలనందించిన వైతాళికులనందరినీ ఒక క్రమ పద్ధతిలో వారందరినీ పరిచయం చేస్తూ, పదసంవిధానంలో కొత్త పోకడలతో ఒక మానసికావస్థలోకి చదువరులని తీసుకొని వెళతారు. ఆంగ్లం, తెలుగు, వివిధ ప్రాంతాల మాండలిక పదాలు, వాడిగల శబ్దాలు, ఒడుపుగా పదప్రయోగాలు చేస్తూ ఆద్యంతం ఆసక్తికరంగా ఈ కవితలని అందించారు నమిలికొండ బాలకిషన్‌రావు.

కవిగా, న్యాయవాదిగా, పత్రికాసంపాదకులుగా, సహృదయులుగా, విశిష్టకార్యక్రమాల నిర్వాహకులుగా, ప్రచురణలకర్తగా, వక్తగా, బహుముఖ ప్రావీణ్యంగల నమిలికొండ బాల కిషన్‌రావు తనదైన శైలిలో అందరినీ మననం చేసుకుంటూ, తనతో సాన్నిహిత్యం కలిగిన, సాహిత్య సృజన చేస్తున్న కవులను, కవయిత్రులను, రచయితలను, రచయిత్రులను,

ాకారులను, కళాకారులను, పాత్రికేయులను, భాషావేత్తలను అక్షరరూపంలో నిక్షిప్తం
కవి నమిలికొండ బాలకిషన్‌రావు. ఈ రకమైన కవిత్వాన్ని ప్రత్యేక పార్శ్వంగా పేర్కొన
. అది వెలువడిన కాలానికి ఇదొక నూతన ప్రక్రియ.

ీర్తిశేషులైన కవులను, రచయితలనూ స్మరిస్తూ వర్ధమానంలో సాహితీజగత్తులో తారా
లో వెలుగొందుతున్న కవులను ప్రస్తుతిస్తూ 'నబారా' ఈ అక్షరచిత్రణ చేసారు.
రణంగా సాహిత్య వ్యాసాలలో ఇతర కవులను గురించి, వారి రచనలను గురించి
ించడం గమనిస్తుంటాం. కాని ఏకంగా ఇంత మందిని గురించి, తనకు నచ్చిన
ో కవిత్వం రూపంలో రాయడమే కాకుండా దానిని ఒక పుస్తక రూపంలో
వరించడం అభినందించదగ్గ విషయం. తానెంతో ఆసక్తిదాయకంగా ఈ చిత్రణ చేసి
వ రచయితలకు, కవులకు మార్గదర్శకంగా నిలిచారు. వీరి అభిరుచి ప్రశంసనీయం.
ంలో ఏ మాత్రం స్వప్రయోజనం లేదు. సాహితీ ప్రయోజనం తప్ప. ఎందరో సాహితీ
ష్టుల శైలి, కవితారీతులు, కథాకథన వైచిత్రి, నవలాకారుల, పాత్రికేయుల ముఖచిత్రం
వరులకు ద్యోతకమయ్యేలా మలిచారు. తెలుగు సాహితీ రంగస్థలంపై తమ హావభావ
ర్శనలు చేసిన ఎందరో కలం కళాకారుల నేపథ్యాన్ని, వాచాలత్వాన్ని సముచితరీతిలో
ించారు నమిలికొండ బాలకిషన్‌రావు.

మినీ కవిత్వం ప్రభంజనంలా వెలువడుతున్న రోజుల్లో ఇంకా 'నానీ'లు కళ్ళు తెరుచు
ుందే ఈ బాణీలో వైతాళికులపై అక్షరచిత్రాల రూపంలో కవిత్వం వెలువరించిన
రా సాహితీ ప్రపంచంలో ధృవతారగా నిలిచిపోతారనడంలో సందేహం లేదు. ❖

# 'అక్షర చిత్రాలు' - ఒక వినూత్న యత్నం

- నందనం కృపాకర్

ఎనభయ్యవ దశకంలో వచ్చిన కవితా ప్రక్రియలు ఎంతోమంది యువకవులను సాహితీ ప్రపంచానికి పరిచయం చేసినవి. ఏ మాత్రం భావుకత కలవాడినైననూ వచన కవిత సొంతం చేసుకుంది.

కవిత్వం రాయాలంటే ఒకప్పుడు ఇది ఉండాలి, అది ఉండాలిఅనే దశ నుండి... తనకు కలిగిన భావుకతను యధేచ్ఛగా, నిస్సందేహంగా ప్రదర్శించు కోవడానికి ఒక ఊపును కలిగించింది. ఆ ఊపు కొంతమందిలో తాత్కాలికమైననూ, మరికొందరిని ఆలోచనా భూమికతో ముందుకు సాగడానికి సంసిద్ధుల్ని చేసింది. కవి అనేవాడు ఈ మార్గంలో ఉద్యుక్తుడై, పురోగామియై, సాధకుడై, నిత్యానుశీలుడై తన అభిరుచుల మేరకు కవిత్వాన్ని మెరుగులు దిద్దుకుంటూ కొత్త కొత్త పోకడలకు మార్గగామియైనాడు.

వచన కవిత మినీ కవితై, మినీ కవిత ముక్తకమై, ముక్తకం చిత్రమై, చిత్రం హైకూ, నానీలు, రానీలు, సినీలుగా... ఇలా... రూపాంతరం చెందుతూ... ఎవరి ప్రతిభను అనుసరించి ఆ విధముగా ప్రకాశమానం అవుతూ వచ్చాయి.

ఈ రూపాంతరంలోనే నమిలికొండ బాలకిషన్‌రావు 1986లో 'అక్షర చిత్రాలు' పేర సాహిత్యకారుల జీవన చిత్రాలను అందించారు. అయితే ఇప్పుడు బాగా ప్రచారంలో ఉన్న నానీ'ల దృష్టితో కాకుండా... మరితర ప్రక్రియలను పరిగణనలోకి తీసుకోకుండా బాలకిషన్ రావు అక్షర చిత్రాలను అనుశీలించాల్సి ఉంటుంది. ఈ అక్షర చిత్రాలను గురించి మనం చెప్పుకునే ముందు ఈ కోవలో వచ్చిన ఇతర ప్రక్రియలను కూడా ప్రస్తావించుకోవడం సముచితంగా ఉంటుంది.

'నానీలు'అంటే నావి-నీవి వెరసి 'నానీ'అంటే మనవి అని అర్థం. మరోరకంగా 'నానీలు' అంటే చిట్టికవితలు అని కూడా చెప్పుకోవచ్చు. నానీల నిర్మాణక్రమాన్ని చూసినట్లయితే మనం కొన్ని విషయాలను గమనించవచ్చు.

* వచన కవితల్లోలాగే నానీల్లో కూడా పాదవిభజనకు హేతుబద్ధత అంటూ ఏమి కనిపించదు.

* పద్యాల్లోలాగే నాలుగు పాదాలు ఇందులో కనిపిస్తాయి.
* ఛందోగమనానికి ప్రాధాన్యత తక్కువ.
* నానీల్లో అక్షరాల విస్తీర్ణం 20 నుండి 25 అక్షరాల వరకు నేడు కనిపిస్తున్నది.
* వ్యర్థపదాల నిరోధం తప్పనిసరి.
* కవికి కావలసినంత స్వేచ్ఛ లభిస్తుంది.
* సామాజికం, ఆధ్యాత్మికం, కవితాత్మకం ఇలా దేన్నైనా కవితా వస్తువుగా స్వీకరించవచ్చును.

"సూక్ష్మంలో మోక్షం" అనే నానుడి బాగా ప్రచలితంలో ఉన్నదే.... పద్యాల్లోకాని నానీల్లోకాని, హైకూల్లోగాని సంక్షిప్తీకరణ-సాంద్రత, భావగాఢత, ధారణానుకూలత ప్రధానంగా కనిపిస్తుంటుంది.

ఇటీవలి కాలంలో తెలుగులో 'హైకూ'లకు బాగా ప్రచారం వచ్చింది. వీటిల్లో సంక్షిప్తీకరణ పతాకస్థాయికి చేరుకున్నది. నానీల్లో మనకు 25 అక్షరాల వరకు కనిపించే విస్తృతి హైకూల్లో 17కే కుదించబడింది.

ఒకప్పుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ తన ఆంధ్రజ్యోతి వారపత్రికలో మూడు నాలుగు పాదాల కవితా చమక్కులను ప్రచురించి కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టినాడని చెప్పవచ్చు.

జాతీయ విప్లవకవిగా వాసికెక్కిన శ్రీ యెల్దండ రఘుమారెడ్డి సుమారుగా రెండు దశాబ్దాల క్రితం 'రామబాణం' పేరుతో 'జాగృతి' వారపత్రికలో ధారావాహికంగా కొన్ని సంవత్సరాలపాటు రాసాడు. ఆ పిదప ప్రొఫెసర్ కసిరెడ్డి వెంకటరెడ్డి అదే పత్రికలో 'కసిరెడ్డి మాట' పేరుతో వాక్చిత్రాలను అందించారు.

'నానీల' పేరుతో ఆచార్య ఎన్. గోపి 1998లో, అలాగే 2001లో అంబల్ల జనార్ధన్ బొంబాయి నగర చిత్రణను "బొంబాయి నానీలు"గాను, "సాహిత్య నానీలు" డా॥ ద్వానాశాస్త్రి పుస్తకాల్ని ప్రచురించారు. అయితే ద్వానాశాస్త్రి మాత్రం ఇందులో రచయితల వ్యక్తిత్వాల్ని చిత్రీకరించారు.

ఎ.బి.కె. సంపాదకులుగా ఉన్నపుడు డా॥ ఎన్. గోపి గారి 'నానీలు' నాలుగైదు నెలలపాటు 'వార్త'లో రాగా, అదేకాలంలో 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో ఎన్. రఘు నానీలు

వచ్చాయి. అలాగే యశశ్రీ రంగనాయకి నానీలను 'చైతన్య కవితపత్రిక'లో వెలువరించారు. తరువాత అది 'సూరీడు చెంపలు' పేరుతో పుస్తకం 2001 ఆగష్టులో వెలువరించారు.

నానీలు, హైకూల పిదప కోట్ల వెంకటేశ్వర రెడ్డి కొన్ని 'రానీ'లను రాసారు. రానీలంటే రాజకీయ నీతులు అన్నమాట. ఇకపోతే మార్చి, 2002 నుండి 'పత్రిక' అనే మాసపత్రికలో 'సినీలు' అనే పేరుతో సినిమారంగానికి చెందిన వారిపై మూడు పాదాల కవితలు కనిపించాయి....

ఇక మళ్ళీ మన బాలకిషన్‌రావు అక్షరచిత్రాలు దగ్గరికి వద్దాం. మొదట మచ్చుకు కొన్ని అక్షరచిత్రాల్ని చూద్దాం. ఆ పిదప మరికొన్ని వివరాలు చెప్పుకుందాం.

*తెలుగు భాషా తోరణాలు - సుగంధ కితాబులు*
*గబ్బిలం, కస్తూరి సుగంధాలు - మన జాషువా జాగృతులు.*

*సాహిత్య అభిలాషి - మిమిక్రీ ఋషి*
*ప్రపంచ విఖ్యాత - నేరెళ్ళ వేణుమాధవ్ ఖ్యాతి.*

*సభారాజు - తెలుగు కవులు*
*సాహిత్య ఫ్యాక్టరీ - హైద్రాబాద్ పోతుకూచి.*

*వార్తావనికి - వరంగల్ వాణి*
*జనవాణికి - యం.యస్. ఆచార్య.*

*జగన్నాథుడన్నా - జనం మనమన్నా*
*జనాన్ని నేనన్న శ్రీశ్రీ - ఓ యుగపురుషుడు.*

*చెవాకులకు - గల్లా పట్టిన మాటలు*
*కాళోజి గొడవే - నా గొడవ.*

*సాహిత్య సాధన - ఆంధ్ర-సంస్కృత కోవిదుడు*
*బహు సమ్మేళనాధ్యక్షుడు - భండారు సదాశివరావు.*

*తీపి మాటల - చక్కెర గడలన్నీ*
*సినారె చిరు వాక్యాలు - ఈ కావ్యానికి పూదండలు.*

## కాలం వెంట నడిచి వస్తున్న...

*శిల్పం-శైలి*
*క్లుప్తత-స్పష్టత*
*వరంగల్ కీర్తి కిరీటం*
*గార్లపాటి రాఘవరెడ్డి.*

*రాస్తే విమర్శ*
*చేస్తే సమీక్ష*
*సర్వదా జ్ఞాపకం*
*ఇది శ్రీరంగస్వామి మూస.*

దాదాపు పదహారు సంవత్సరాల క్రింద ప్రచురించబడిన ఈ అక్షరచిత్రాల్లో సాహితీ లోకంలోని పండుటాకులతోపాటుగా లేలేత రెమ్మల గూర్చిగూడ ప్రస్తావించడం జరిగింది. ఇందులో 152 మంది కవులు, రచయితల గూర్చి పేర్కొన్నారు. ఇది అంత సులభమైన విషయం మాత్రం కాదు. 52 పేజీల ఈ కావ్యంలో 38 పేజీల్లో పేజీకి మూడు చొప్పున అలాగే 14 పేజీల్లో పేజీకి రెండు చొప్పున చిట్టి కవితలు బాలకిషన్‌రావు అక్షరచిత్రాల్ని రాసారు. మరింత లోతుకి వెళ్ళి తరచి చూచినట్లయితే ఇందులో చెప్పిన 152 అక్షరచిత్రాల్లో 114 నాలుగు లైన్లు, 21 ఐదు లైన్లు, 17 ఆరు లైన్లు చొప్పున చెప్పడం జరిగింది. అక్షరాల పొదుపును పాటించినప్పటికి అక్షర రమ్యత, వాక్య నిర్మాణం, గంభీరార్థం, ప్రాసల విషయాలపై ఇంకాస్త దృష్టి కేంద్రీకరించి ఉండి ఉంటే కడురమ్యంగా ఉండేది, కాని మినీ కవితా ప్రభంజనం రోజులు కదా !

తెలుగు సాహిత్య రంగస్థలంపై సాహసించిన చిన్నవాన్ని, మొదటి 'అ' దిద్దుతున్నవాన్ని అని బాలకిషన్‌రావు ఇదే పుస్తకంలో కృతజ్ఞతల్లో చెప్పుకున్న విషయాన్నే ఇక్కడ ప్రస్తావించడం సబబుగా ఉంటుందనుకుంటాను. ఈ దృష్టితోనే ఈ పుస్తకాన్ని పరిశీలించాలి.

సాహితీరంగంలో చేసిన ఏ కృషియైనను సర్వకాలాలకు సమగ్రంగా కనిపించడం, అనిపించడం దుర్లభం. ఒకవేళ ఉంటేగింటే చాలా అరుదైన విషయం అనే చెప్పుకోవాలి. ఎందుకంటే ఏ పుస్తక రచనాకాలంలోనైనా మన దృష్టిపథానికి అందకపోవడం వలననో, అలాగే ఆ తరువాతి కాలంలో మరికొంత మంది సాహితీరంగంలో ప్రవేశించడం,

ప్రకాశించడం వలననో ఇంకా అనేక ఇతర కారణాలవలననో అందరి గూర్చి ఎందులోనైనా చెప్పడం అసాధ్యమైన విషయమే.

ఇక్కడ మనం గమనించాల్సిన విషయమేమిటంటే ఈ అక్షరచిత్రాలు కూడా ఇదే కోవ లోకి వచ్చినా... నానీలు, హైకూలు, రానీలు, సినీలు మొదలగు ప్రక్రియలు రానికాలంలో బాలకిషన్‌రావు యొక్క ఈ అక్షరచిత్రాలు వచ్చినవి. అందువలన ఇది ఒక చక్కని, విశిష్టమైన ప్రయత్నమని చెప్పక తప్పదు. దీన్నాధారంగా చేసుకుని మరెవరైనా కాలానుగుణ చేర్పులు చేయడానికియత్నించవచ్చు. ఈ అక్షరచిత్రాలు, నేటి నానీలు, హైకూలు, రానీలు, సినీలకు మార్గగామియై నిలిచిందని చెప్పకొన్నాను. ఎవరికీ అభ్యంతరముండదనే అను కుంటున్నాను.

*"మరెందరో కవులకు*
*క్రొత్త కలాలకు,*
*అక్షర మినీ కవితలు*
*మెనీ కవితలు కవులకు*
*అక్షర చిత్రాల శుభాంజలులు"*

అన్న ఒక చక్కటి ముగింపు ఇచ్చిన
నమిలికొండ బాలకిషన్‌రావును అభినందిస్తున్నాను. 

# నమిలికొండ బాలార్క బింబం

**- పల్లె సీను**

బాలార్కుని కిరణాలకో స్పృహ వుంది. దర్శిస్తే.... ! దివ్యకాంతుల సౌరూ.... ! స్పృశిస్తే ... వెచ్చనూర్పుల హాయీ.... ! మనిషి అంతరంగాన్ని విశిష్టానుభూతివైపుకు లాక్కుపోతుంది. అలాగే నమిలికొండపై ఉదయించిన బాలకిషనుడి కదలికల్లోనూ స్పృహ వుంది. తానుగా కదిలి కదలించడమూ... తోడుగా కుదిరి స్వాగతించడమూ అభినందనీయమనక తప్పదు. ఏదైనా... సందర్భాన్ని ఆయన వెదకరు. సందర్భమే ఆయన్ను వెదకుతూ వస్తుంది.

సాహితీ రంగస్థలంపై నిరంతర దర్శనీయాంశాల్ని ప్రదర్శిస్తూ, తనదైన పాత్ర నిర్వహించడంలో *"తనకు తానే సాటి"* అనిపించుకుంటున్నారు బాలకిషన్‌రావు గారు. వృత్తిరీత్యా న్యాయవాదిగా తెలుపూ నలుపుల వైవిధ్యం బేరీజువేసి ప్రవృత్తిరీత్యా వాటి ఫలితాల్ని సమాజానికి అందజేయడంలో ఆయన చేస్తున్న కృషి ప్రశంసనీయం. తన అరుదైన జ్ఞానజ్యోతుల్ని అత్యంత రమణీయంగా జనప్రకృతిపై పరచి, కాఠిన్యపు కొండల్ని నమిలి, బాలతేజంతో విశ్వసౌందర్య స్ఫూర్తిని కలిగించబోయే బాలసాహితీమూర్తి కిషన్‌రావు గారు. ఆ స్ఫూర్తిని కవిహృదయాలకు అలవోకగా అందించాలనే ఆశయంతోనే "శాంతి-సమత"అనే కవితా సంకలనాన్ని 1989లో వెలువరించారు.

ఒకనాటి సాయంత్రంవేళ ఆయన మనస్సు తిరగబడి *"ఈ దేశం నీకేం చేసిందని ?"* అడిగింది. *"మరి నువ్వేం చేశావు ఈ దేశానికి ?"* అని బాలార్క ఉషస్సు నిద్రలేపి అడిగినప్పుడు, ఎక్కడో మేలుకున్న పశుత్వపు మూర్ధన్యానికి *'మనస్సు తనను తానే తిట్టుకుంది'.* అప్పుడే - సాంప్రదాయ భిన్నత్వాలకు నిలయమైన రీతులన్నీ వివరించి, నా దేశం బాధ పడుతోందని స్థిమితపడ్డాడు కవి. బాధ్యతలు, బరువులు విధిగా తలపై మోయాలని తపన పడ్డాడు. ప్రతి నిముషాన్ని మమతావాత్సల్యాలతో ఆదరిస్తే, మానవతా సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయవచ్చని ధీమా వ్యక్తం చేశాడు.

"సన్మానం" కవితద్వారా బాలకిషన్‌రావుగారు వాగ్దానవర్షంలో తడిసి, తనేమంటున్నారో తెలియని ఉన్మాదిలా... అందిస్తున్న వాగ్దానం సవినయంగా -

*"వాగ్దానం చేస్తున్నా - తప్పక మీ విషయం !*
*పై వారికి చెప్పి ఫైళ్ళను రైళ్ళుగా ఉరికిస్తా !"*

అంటున్నారు. రాజకీయాన్ని రజకీయం చేసి, ఉతికి ఆరవేశారీ ఖండికలో.

వాగ్దానాల పరంపరలో పత్రికలవాళ్ళకూ స్వేచ్ఛనిచ్చి, రాసుకోండనీ,
*"ఎల్లప్పుడూ సమస్యలు సమస్యలుగానే వుంటాయనీ,*
*మళ్ళీ వచ్చే ఎన్నికల దాకా - కొన్ని వాగ్దానాలు మిగల్చండనీ,* సెలవు తీసుకొని
*ప్రజల కళ్ళలో దుమ్ముపడేలా వాహనం దూసుకుపోయిందన్న"*
ఆయన మాటల్ని విశ్లేషించి - చెప్పుకోదగిన అంశంగా ఇక్కడ చెప్పక తప్పదు.

*"ప్రజాస్వామ్య వ్యవస్థ కేవలం - పామర జనుల్ని మెప్పించేలా అందించే పరిపాలనా వ్యవస్థ"* అనుకున్నాను. కాని *"యీ భాగోతుల (భారీ గోతుల) వేషాలు చూసి నేను బరువై పోతున్నాను"* - అని ఆవేదన చెందారు రచయిత.

ఆ వరుసలోనే.....

*"బహుపన్నుల రాజ్యంలో - బడుగైపోతున్నా !*
*సమ్మెటపోటుల సమ్మెల్లో - ససుజీవితమంటున్నా !"*

*"గడియ విరామం లేని - గవ్వ రాకడలేని"* శుష్క జీవితంలా భావిస్తూ రాయిలా పడి వుంటున్నానని వాపోయాడు. అది కేవలం బాలకిషన్‌రావు గారి ఆర్తి మాత్రమే. ఆవేశం, ఆవేదనను చీల్చివేయగల శక్తి కూడా వుందాయనలో. సమాజంపట్ల ఆయన స్పందించిన తీరు చూస్తే, రాయిలా పడివుండడం కాదు, రౌతులా కవితల్లో అశ్వవేగాన్ని పెంచి నడిపించే సమర్థుడాయన. *"మీరూ నేనూ కలిస్తే.... శ్రమిస్తే.... రాళ్ళు సైతం రంగరించగలం, రాజ ధర్మాన్ని కాపాడగలం - ప్రజాస్వామ్య హక్కులకే పరీక్షలు పెట్టగలమని"* నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

సంగీతం వినిపిస్తూనే కాలాన్ని సూచించే "ఎలక్ట్రానిక్-గడియారం" ద్వారా మనిషి కర్తవ్యాన్ని గుర్తు చేశారు నమిలికొండ వారు. కాలచక్రం ఆగదు. కాని సంగీతం - సందర్భాన్నిబట్టి మాత్రమే ధ్వనిస్తుంది. దానిని సంకేతంగా భావించిననాడే మనిషి కర్తవ్యం మొదలవుతుంది. తద్వారా ఫలవంతమైన జీవనయానం సాగిస్తాడు మానవుడు. అట్లని కేవలం ఎవరో ఒకరు కదలిక యివ్వడంతోనే ప్రారంభించకుండా, కవితానై నిద్రలేచి జీవన

సంగీతామృతపానం చేయబోయేముందు..... ! ఉషోదయమైందని జనజాగృతం చేసి... తన చేతిలోని మధుపాత్రను వారికి వంచి, శాంతి-సమతా భావ సంభావితుల్ని చేయవలసిన బాధ్యత, బలవంతుడైన కవిలోనే తప్పకవుంటుందనీ, రాబోయేతరాలకు తాను ఇవ్వబోయే సందేశం, నిర్మాణాత్మకంగా, ఆదర్శప్రాయంగా వుండాలని కోరుకుంటాడు. కాని యిప్పుడా కవి.... !

*"కమర్షియల్ జీవితానికి - కమ్మని పానీయానికి - వచ్చే*
*నేటి కవిత్వం..... ! - నిన్ను అమాంతం మ్రింగివేస్తుంటే.... !*
*ఇంకా నిలదొక్కుకుంటున్నావా ?"* అని ప్రశ్నిస్తూ.... తిరిగి గంభీరంగా -
*"అవునూ ! నీవే నిలదొక్కుకోగలవు -*
*నీకుదప్ప - అన్యులకాబలం లేదు కవీ !"* అంటున్నాడు బాలకిషన్‌రావుగారు. మరి... కవి ! *"రవిగాంచని చోటునే చూడగలడు గదా !"*

బాలకిషన్‌రావు గారికి నిరంతరంగా సమాజ పరిశోధనం చేసే అలవాటుంది. అన్ని కోణాల్లోనూ తనకున్న ధ్యాసను మరల్చి - సైంటిస్టు, పాపిస్టును మన కళ్ళముందుకు త్రోసి - రోడ్డుపై నడిపించారు.

తనకు సిద్ధించిన సౌభాగ్యాన్ని పిచ్చిగా నెమరు వేసుకోవడంలోనూ ఓ అనుభూతి వుందని నిరూపించారు. తనకు కావలసిన ఎలిమెంట్సు కోసం - ఏ ప్రాణి కదలికనీ గుర్తించక సాగిన పాపిస్టుకి... మురిసి ముద్దుపెట్టుకోవడంకూడ కొత్త ఆనందాన్నిచ్చిందనడం ఆశ్చర్యమే మరి ! ఆ మాటకొస్తే... ! రచయిత ఊహించిన ఏకాంతంలోనూ... హృదయ సౌందర్యమూ, అలాగే దుర్భరమైన ఆవేదనా వుంటాయన వచ్చును.

మరో కవితలో.... *"బానిసత్వం నుండి బానిసత్వం వరకు*
*ఎదిగిన ఈ స్వేచ్ఛా ప్రపంచ రాజ్యాల్లో*
*ఇంకా చస్తూ.... బ్రతుకుతున్నాం".*

స్వరాజ్యం సాధించుకున్నా సవ్యంగా మనుగడ సాగించ లేకపోతున్నామనే బాధతో... అభాగ్య స్త్రీల అగచాట్లకు కన్నీటి సంద్రాలు పొంగుతున్నాయనీ, ఏ మానవత్వం యీ సముద్రాలకు చెలియలికట్ట వేస్తుందని ప్రశ్నిస్తున్నారు. ప్రపంచ భస్మీపటలం కాకముందే, ఆకాశంలో అణు యుద్ధం జరగకముందే సమాధానం చెప్పమంటున్న కవికి, విశ్వ సౌందర్యాన్ని దర్శించడం మాని వినువీధి శృంగారాన్ని అవహేళనం చేసే కురూపి రాక్షస మూకలు ఏం చెప్పగలవు ? జన-జల ప్రకంపనాలు జగత్కాలుష్యంలో ముప్పూటలా

మునిగి తానమాడుతుంటే... ఇంకేం జవాబు ? కొత్త చిగుళ్ళు వసంతంలోనేగాక, అన్ని ఋతువుల్లోనూ కనిపిస్తుంటే.... పదగాంభీర్యం పదాకృతిలోనేగాక, పదవికృతిలోనూ దర్శన మిస్తుంటే... ప్లాస్టిక్ యుగం వస్తుస్థితికేగాక, జీవనగతికీ మార్గదర్శకం అవుతుంటే ఇంకేం జవాబు ? అంటూ నీరసం వ్యక్తం చేస్తున్నారు.

"లాడ్జింగు బస - టెస్ట్ ట్యూబ్ నస"తో కృత్రిమ జీవితానికి అలవాటుపడిన వారసత్వం రాబోతోందని హెచ్చరిస్తూ, సహజ ప్రకృతి జీవితమే, సహజ ప్రశాంత జీవితమని నొక్కి చెబుతూ.... "*ప్రకృతి దరికీ ప్రశాంతం ఒరకీ*" పూల వంతెన నిర్మాణం చేస్తున్నారు బాలకిషన్ రావుగారు. అందుకే.... నమిలికొండ కవిత్వం బాలార్క బింబంలా తొంగిచూస్తూనే, భవితవ్యానికి మార్గం వెదికే ఆలోచన, నిరంతరంగా సాగిస్తున్నారు.

ఇప్పటిదాకా కవిగారు నిస్సహాయంగావున్న ఈ జీవనగతిని తలచి, తమాయించుకోలేక పోయారు. తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచి, తలపైకెత్తి విశృంఖల స్వేచ్ఛాభావం తనలో నింపు కొని... మనిషి యెదిగిన తీరుకు గర్విస్తూ, వినూత్న శాస్త్ర జ్ఞానానికి ఆహ్వానం చెబుతూ సహపంక్తి భోజనాలకు సర్వమానవాళిని తన ప్రగతి సౌధానికి ఆహ్వానిస్తున్నాడు. ఎంత మార్పు !

చిరునవ్వుతో కార్మికలోకాన్ని కరువుతీరా స్మరించి, దర్శించి, వారి కళ్ళల్లో కాంతి నింపాలనీ, వారి మనోఫలాకాలపై వినూత్నభాషను దిద్దించాలనీ, చిన్నారి తమ్ముళ్ళుగా వారి స్నేహంతో తరించిపోవాలని ఆకాంక్షిస్తున్నాడు. ఎంత స్నిగ్ధత !

సమస్త దేశ పౌరులకూ స్నేహసౌభాగ్యాలే ముఖ్యమనీ, భేదభావాలుకూడదనీ, ప్రపంచ శాంతి ఒక్కటే జీవన సౌమనస్యానికి ప్రత్యక్ష నిదర్శనమనీ సందేశమిచ్చారు - ఎంత ఓర్పు !

ఎంతో యెదిగిన మనిషి "*అంతా మనం*" అనే చింత కలిగిననాడు ఎంతో కొంత సాధించడం తథ్యమనీ, ముక్తకంఠంతో "భారతీయ శాంతి భవితవ్యాన్ని ఘోషిస్తూ... సమతా శంఖారావాన్ని పూరిస్తూ సాగిపోయారు" బాలకిషన్‌రావుగారు. ఏది యేమైనా ఈ సంకలనం ద్వారా నమిలికొండ వారు "సమత"అనే పదాన్ని ఎంతో సౌఖ్యంగా మలచుకున్నారు. వివిధ సంస్థల మనోగతాన్ని క్రోడీకరించి, ప్రోత్సహించి, చిరకాలం మనగలిగేస్థాయిని ఆకాంక్షించే విధంగా, తానై శ్రమించి... సాహితీ కళాపూర్ణతకు నీడగా వుంటున్న ధన్యజీవి అయ్యారు. అలా... ఎందరికో ఆదరణీయుడైన 'నబారా' గారి యీ పాత్తము అందరి మనసుల్లోనూ శాంతి నింపి, సమతాభావాన్ని సుసంపన్నం చేస్తుందని ఆశిద్దాం. 

# పిట్ట కొంచెం - కూత ఘనం

**- ఎమ్మెస్సార్**

ఇవ్వాళ తెలుగు కవిత్వాన్ని తూచే సాధనాలు మారిపోయాయి. కొన్ని రోజులు కవిత్వం లో కవిత్వం పాలెంతో, అకవిత్వం పాలెంతో కొలిచేవారు విమర్శకులు. కవితా వస్తువు గురించి 20వ శతాబ్ది ప్రారంభంలో చాలా చర్చ జరిగింది. ప్రేయసీ మెల్లకన్ను మీద పద్యాలా లేక రాజకీయాల మీద చురకలా ? సామాజిక స్పృహ కావాలని కొందరంటే, దేశభక్తి కావాలని కొందరన్నారు. సంప్రదాయవాదులు, అభ్యుదయవాదులు అందరూ కలిసి సమాజ చైతన్యంకోసం కవిత్వం రాయాలని తీర్మానించుకున్నారు కాబోలు కొంత కాలం ఆ కవిత్వమే నిజమైన కవిత్వంగా చెలామణీ అవుతూవచ్చింది. తత్ఫలితంగా ఆకాశం దారుల వెంట హడావుడిగా వెళ్తున్న కవిత్వాన్ని భూమార్గం పట్టించాడు శ్రీశ్రీ.

వస్తువు విషయంలో పేచీలు తెగిపోగానే ప్రక్రియ విషయంలో పేచీలు ప్రారంభం అయ్యాయి. "పద్యం నడుములు విరగగొట్టాలని, తాను విరగ గొడుతూ రాసిన కవిత్వం నిజమైన కవిత్వం" అని పఠాభి అంటే - పాత తూనికలు విసిరేసి కొత్తవి తెచ్చుకోవలసి వచ్చింది విమర్శకులకు. కుందుర్తి వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా నడిపించాడు పద్యాలు రాసేవాళ్ళూ కొంతకాలం కలానికి తలవంచి వచన కవిత్వం రాయడం ప్రారంభించారు. అయినా ప్రతి కాలంలోను శతకాలు వస్తూనే ఉండేవి. వాటికి మాత్రం మినహాయింపు ఇచ్చినట్లు కనిపిస్తోంది. బహుశ దానికి కారణం వేమన కావచ్చు.

ప్రక్రియలో మార్పు వచ్చాక కవిత్వాన్ని కొలిచే సాధనాలు మరీ మారిపోయాయి. ఇవ్వాళ పలాన వస్తువు కావాలన్న నియమం లేదు. ఫలాన రసం కావాలన్న వాంఛ లేదు విమర్శకుడికి. పద్యమా ! గద్యమా ! వచన కవిత్వమా ! ఇవి పాత చింతకాయ ప్రశ్నలు. మినీ కవిత కొన్నాళ్లు రాజ్యమేలి వుండవచ్చు. ఇవ్వాళ చాలా కొత్త ప్రక్రియలు వేరువేరు దేశాల్నుంచి, భాషల నుంచి వచ్చాయి. హైకూలు మూడే పాదాలు, నానీలు నాలుగు పాదాలు శతకాల్లోని పద్యాల్లా ఇవి ముక్తకాలు. హైకూలు తెలుగులోకి రాకముందు

హైలైట్‌లా మినీ కవిత వచ్చింది. దానికి పాదాల నియమమేమీ లేదు. ఎన్నో నియమాలు ఉన్నా వాటిని బ్రేక్ చేయడంలో తెలుగువాడు ప్రథముడు.

వరంగల్ సాహితీ మిత్రుడు శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు 1990లో ప్రచురించిన కవితా సంపుటి "అక్షరాల్లో అనంతం"ను ఓ పన్నెండు సంవత్సరాల తరువాత చదివితే దీన్ని మినీ కవిత్వం తరాజులో వేసి కొలవాలా ? హైకూల్లో కొలవాలా, నానీల్లో కొలవాలా అని సందేహం కలుగుతుంది (అప్పుడు హైకూలు లేవు కదా, మినీ కవితగానే తీసుకుందాం మరి). కవిత్వానికి "సామాజిక స్పృహ" అనే ఒక వస్తువు ఉంటే చాలా ! ఇవ్వాల కవులందరూ ఈ దృక్పథంలోనే రాస్తున్నారు ఒకరో ఇద్దరో తప్ప.

బాలకిషన్‌రావు కవితా సంపుటినిండా నిర్వచనాలు వున్నాయి. నినాదాలు, నిర్వచనాలు కవిత్వంలో చెపితే పాఠకుడికి నాలుక మీద నిలుస్తాయి. అవసరమైనప్పుడు సందర్భాను సారంగా తను వాటిని ప్రయోగిస్తాడు. కవిత్వం ప్రయోజనం ఇదే అయితే కవిగా నమిలికొండ ధన్యజీవి. ప్రజాకవి - ఎవరంటే - ఒకరు వేమన - ఆయన వాదం వెయ్యి ఇజాల నిజం - మరొకరు కాళోజి - ఆయన నైజం - చావుబ్రతుకుల వాదం - ఇదీ నమిలికొండ వ్యక్తీకరణ, ఈయన కాళోజీని అనుసరించినట్టుగా అనిపిస్తుంది.

మరోచోట "లంచగొండి"ని నిర్వచిస్తూ కవి అంటాడు -

*"జీతం తీసుకుంటూ*
*తను చేసే ఉద్యోగానికి*
*న్యాయం చేయని వాడు*
*నిజమైన లంచగొండి"* -

ఇంకా....

*"సెక్సు భావమే*
*తెలియని పసికందుని*
*రేప్ చేసే సమాజమిది".*

**కాలం వెంట నడిచి వస్తున్న...**

ఆవేశము, ఆలోచన, స్పందనఉన్న ప్రతీవాడు కవీ అయితే - కవి కానివాడు భూలోక మంతా వెదికినా దొరకడు. అనంతమైన విశ్వాన్ని అక్షరాల్లో బంధించి చూపించవచ్చు అనుకుంటే తన జీవనసారాన్ని అందులో తురమాలి. అనుభవాలను, కావ్యములను అందించాలి, ఈ విషయంలో నమిలికొండ తనమేరకు కృతకృత్యుడు అయినాడు.

ఇక్కడ ఇరువర్గాల వాక్ వివాదం లేదు. తాను ఏది అనుకున్నాడో ఆదే తన కవిత్వంలో ప్రతిబింబించాలి, ఆ ప్రయత్నంలో తనదైన శైలిని ప్రదర్శించాడు. అనంతమైన అక్షరానికి మొదలు, తుది - నిర్ణయించి - అక్షరాల్ని ఆయుధాలుగా చేసుకొని చైతన్య యుద్ధం చేయడానికి సన్నద్ధమైనవాడే కవి. ఆ కవి మరో శతాబ్దంవైపు వడి-వడిగా ప్రయాణం సాగించ వలసిన నేపథ్యం ఎంతో ఉంది కదా ! ఆ నేపథ్యముతోనే ఈ కవి ప్రయాణాన్ని ప్రారంభించాడు.



# 'సందేశాత్మక సహజకవి'

- డా॥ పి.వి. రమణ

కవుల వ్యక్తిత్వాలు వారి కవిత్వంలో ప్రతిబింబిస్తాయన్నది మనం గమనిస్తున్న సత్యమే. ఈ సత్యం "నబారా"గా ప్రసిద్ధుడైన నమిలికొండ బాలకిషన్‌రావు కవిత్వాన్ని పరిశీలించి నప్పుడు మరింత సన్నిహితమై సాక్షాత్కరిస్తుంది. సర్వమానవాళి సంక్షేమం "నమిలికొండ" కవితాదర్శం. ఇందువల్లనే సామాజిక న్యాయసాధనకు, నిర్దేశిత వ్యాఖ్యానాలుగానూ, మానవ కళ్యాణ ధ్యేయానికి నిర్వచనాత్మక సూక్తులుగాను శ్రీ నమిలికొండ కవితా గీతికలు దర్శనమిస్తుంటాయి. వినూత్న భావాలతోపాటు, విలక్షణ వ్యక్తీకరణ ప్రతి పదాన్ని చైతన్యోద్దీప్తం చేయగల నేర్పు 'నబారా'ది. మానవతా చింతన, సత్యాన్వేషణ, సమతా భావనలతో ఆయన వైయక్తిక జీవనం నిండి ఉంది. కనుకనే "నమిలికొండ" ప్రతి కవితా పంక్తిలోను ఇవే ఆశయాలు అభివ్యక్తమవుతూ ఉంటాయి. ప్రతి అక్షరంలోనూ ఆయన విశ్వజనీన హృదయం ప్రతిఫలిస్తూ ఉంటుంది. మానవ విలువల్ని సంరక్షిస్తూ, సర్వమానవ హితానికి కవిత్వం ప్రేరక శక్తిగా ప్రజ్వలించాలన్న 'నబారా' ఆశయానికి అద్దంపట్టే ఈ పంక్తుల్ని గమనించండి.

*"నా పాళీ - కాలం ఆగిన పెండ్యూలమ్*
*ఆయువు పోయిన శరీరం కాదు - స్వేచ్ఛకు మారు పేరు"*

సామాజిక చైతన్యానికి, మానవ వికాసానికి నిరంతర బోధక శక్తిగా, ప్రేరణస్ఫూర్తిగా, కవి పెద్ద దిక్కుగా నిలవాలనీ, సర్వమానవ సౌభాగ్యానికి మార్గదర్శనం చేస్తూ, ఒక విద్యుత్ అయస్కాంత దిక్సూచిగా కవి పరిణమించాలనీ 'నబారా' భావన. "నా పాళీ ఆగిన పెండ్యూలమ్ కాదు" అన్న పలుకుల్లోని అంతర్యమిదే. కవి హృదయం స్పందనకు సామూహిక తేజోదీపికలు ఈ పలుకులు. ఇక్కడ "స్వేచ్ఛ" అన్నది కవి విశాల చింతనకు, ఉదార ఆశయానికి చిహ్నంగానే ప్రయోగింపబడింది. ఎటువంటి సంకుచిత ఉద్రేకాలకు, స్వార్థ భావాలకులోనుగాని, ప్రభావితంకాని, వంచనా కలుషితంగాని కవి నైర్మల్య హృదయానికి సంకేతం ఈ స్వేచ్ఛ. "యుగయుగాల నుండి మానవ వ్యక్తిత్వాన్ని రక్షిస్తూ

ఉంది కవిత్వం" అంటాడు 'బ్రాడ్‌స్కీ'. కవులు మానవ ఔన్నత్యాన్ని ధ్యేయంగా పెట్టుకొనే కవితావిష్కరణ చేయాలని 'బ్రాడ్‌స్కీ' భావిస్తున్నాడు. చెప్పవలసిన విషయాన్ని సూటిగా చెప్పకుండా సూచన మాత్రంగా అభివ్యక్తం చేసే కవితా కళలో నమిలికొండ బాలకిషన్‌రావు అద్వితీయుడు. వ్యాఖ్యలు, వివరణలు అంటని, భాషా పటాటోపంలేని శక్తివంతమైన పద చిత్రాలతో జీవితానికి సహజ భాష్యంలా ఉంటుంది. నబారా ఈ సృజనాత్మకతే. కాంతిని ప్రసారంచేసే పారదర్శక విషంలా పరిణమించి నబారా భావజాలాన్ని స్పష్టంగా, సర్వ సమగ్రంగా పఠితకు అందచేస్తుంది. 'నబారా' కవితలోని మరో విశిష్ట గుణం పద చిత్రాలు దృశ్యశక్తిగా మారి పఠిత ముందు స్పష్టంగా సాక్షాత్కరించటం. ఈ స్థితిలోనే కవి దర్శనం లోని సూక్ష్మాంశాలనుగూడా ఒడిసి పట్టుకొనే వీలు పఠితకు ఏర్పడుతుంది. ఈ కవితను పరిశీలించండి.

> *"ఇక్కడ విజ్ఞులంగా - అవిజ్ఞుడిని*
> *కనకపు సంహాసనాన కూర్చుండబెడితే*
> *ఆపై విజ్ఞుడు - విజ్ఞులనే*
> *పల్లకీ బోయీలను చేస్తాడు"*

రాజకీయంగా, నైతికంగా, సాంఘికంగా అన్ని విధాలా పతనావస్థకు చేరిన జాతి దురవస్థనూ, అవకాశవాద పోకడనూ విలక్షణ రీతిలో చిత్రించి చూపుతున్నాడిక్కడ 'నబారా' . వేయి కాళ్ళతో వినాశనంవైపు ఉరుకులు పెడుతున్న జాతి దుస్థితికి 'ఎక్స్‌రే' ఈ కవిత. భ్రష్ట రాజకీయాలు, దోపిడీ నాయకులు, బ్లాక్ మార్కెటీర్లు, మాఫియా గ్యాంగులు, వీళ్ళందరితో పాటూ స్వంతలాభం చాలనుకొనే మేధావులు, మానవ బంధాలన్నింటినీ మట్టుపెట్టటం తోనే సరిపెట్టుకోక, మానవీయ విలువల్నీ, నైతిక మూల్యాలనుగూడా నాశనం చేశారు. ఆ శిథిల వ్యవస్థ యొక్క విషాద స్వరూపాన్నే 'నబారా' అక్షరబద్ధం చేసింది. సామాజిక వైపరీత్యాన్ని ఇంత సృజన శక్తికీ, తాత్విక దృష్టి తోడైతే తప్ప కవితా ప్రయోజనం ఫలవంతం కాదు. నబారాతో భావుకుడేగాక, తాత్వికుడు, సాత్వికుడు, దార్శనికుడు కూడా ఉన్నందు వల్లనే ఆయన కవిత్వానికి సమగ్రానుభవ వ్యక్తీకరణ శక్తి చేకూరింది. అభివ్యక్తి ఏదైనా మానవ వికాసమే దాని లక్ష్యమై ఉంటుంది. ఇటువంటి సందర్భంలో ప్రకృతిలోని ప్రతి చలనాన్ని కవితామయం చేయగల నేర్పూ, విభిన్న మానవ ప్రవృత్తుల్ని విప్పి చెప్పగల దక్షతా నబారాలో సహజంగానే ఉన్నాయి.

*"ఈ గుడిసె ధనికుని సీనరీ*
*ఈ బంగ్లా బీదవాని కల"*

అన్న కవితలో ప్రాపంచిక ధోరణితోపాటు, మానవ ప్రవృత్తి వికారాన్ని కూడా అభివ్యక్తం చేస్తున్నాడు 'నబారా'. బీదవాని గుడిసెన్నటికీ బంగ్లాకారాదన్నదే ధనికుని నిశ్చితాంతర్యం. ఆర్థిక అంతరాలలో శిఖరాన చేరిన మానవుడు, లోయలో ఉన్నవాడిపట్ల ఏర్పర్చుకొన్న విద్వేషపూరిత నిరాదరణ వైఖరి ఇది. ఒక కళాత్మక సీనరిగానే ఆ గుడిసెను భావించి పరవశిస్తాడుగాని, యదార్థ జీవితంలో ఆ గుడిసె నివాసుల్ని ఛీత్కరిస్తూ అసహ్యించుకొంటాడు. మానవునిలోని ఈ ద్వంద్వ ప్రవృత్తుల వైరుధ్య రహస్యాలను అంచనావేయటంలో 'నబారా' సిద్ధహస్తుడు. సాంఘిక సత్యాన్ని ధ్వని రూపంలో కవితామయం చేశాడు శ్రీ బాలకిషన్‌రావు అంటూ అభివర్ణిస్తారు ఈ కవితను వ్యాఖ్యానిస్తూ ఆచార్య పేర్వారం, ఆచార్య సుప్రసన్న, ఆచార్య కోవెల సంపత్కుమార్ వంటి సాహితీ మహితాత్ముల సహచర్యం కూడా శ్రీ నమిలికొండ భావన పరిధిని వికాసవంతం చేయటానికి ఎంతగానో తోడ్పడింది. ఆదర్శవాదం, మానవతావాదం శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు కవితా మార్గాలు, ఆదర్శ మానవ సమాజ స్థాపన ఆయన లక్ష్యం. సహోదర భావ సంజనిత సమ సమాజం "నమిలికొండ" కవితా ధ్యేయం, అమృత వర్షాలకు, అనలజల్లుకు స్థావరమైన 'నబారా' కవిత కావ్యాత్మ స్ఫూర్తికి ఒక విద్యుద్దీపిక.



*(ఆంధ్రభూమి దినపత్రిక నుండి పునర్ముద్రితం)*

# నమిలికొండ అక్షరాల లోల్లి

**- డా॥ వి. వీరాచారి**

మనిషి బుద్ధికుశలతకు అక్షరం సాక్ష్యం. మనిషి విజ్ఞానానికి అక్షరం ప్రతీక. మనిషి హృదయ స్పందనల అభివ్యక్తికి అక్షరం వాహిక. ఒక తరంనుండి మరొక తరానికి సంస్కృతి ఫలాలను అందించే భావఝరి అక్షరం. నమిలికొండ బాలకిషన్‌రావుగారు అక్షరాల్లోని ఈ అనంత స్వరూపాన్ని దర్శించి *"రవిగాంచని చోటు కవిగాంచున్"* అని నిరూపించుకున్నారు.

ప్రజాకవి కాళోజి *"ఒక సిరాచుక్క లక్ష మెదడులకు పదును పెడుతుందన్నారు".* సూర్యచంద్రులవంటి కాళోజి సోదరుల ఆలోచనల, అప్యాయతల రుచిని నమిలికొండ చవి చూసినవారు కావడం మూలంగా అక్షరాల్లో అనంత విశ్వతత్వాన్ని తన కవిత్వం ద్వారా ఆవిష్కరించగలిగారు.

బాలకిషన్‌రావు గారు కవిగా తాను దర్శించిన సామాజిక స్వరూపాన్ని యాభై ఆరు శీర్షికల్లో మినీ కవితలను కూర్చి అక్షరాల్లో 'అనంతం' లఘుకావ్యంలో పొందుపరిచారు. అందుకు మచ్చుతునకగా 'కల' అనే కవితను చెప్పవచ్చును.

*"ఈ గుడిసె ధనికుని సీనరీ*
*ఈ బంగ్లా బీద వాని కల"*

*"అల్పాక్షరాల్లో అనల్పమైన అర్థాన్ని చెప్పడమే కవిత్వం"* అన్నారు సాహిత్య ఉద్యమ కారుడు పాల్కురికి సోమన. నమిలికొండ 'కల' మినీ కవిత ఈ సత్యాన్ని నిరూపించింది ఇది నాలుగు పాదాల వచన కవిత. ఇందులో ఆరు పదాలు మాత్రమే ఉన్నాయి. కానీ ఇందులో దాగిన అర్థంమాత్రం అనల్పమైంది. ఈ సమాజంలోని ధనిక, పేదఅనే వైవిధ్యాన్ని ఈ కవిత వ్యక్తం చేసింది. సమాజంలో ఆర్థిక అసమానతలు, భావదాస్యం వున్నంత కాలం ఈ వర్గభేదం వుంటుందిఅన్న భావాన్ని కవి ఇక్కడ సూటిగా, స్పష్టంగా, నిక్కచ్చిగా ప్రకటించాడు. అయితే దీనికి పరిష్కారం లేదా అంటే ? ఉంది, 'పిడికిలి' కవితలో ఆ విషయాన్ని ఇలా వ్యక్తం చేస్తాడు కవి.

"ఈ పైకెత్తిన పిడికిలి - ఒక ఆరాటం
ఒక నినాదం - ఒక విప్లవం
ఒక సందేశం - అన్నీ !!
అణచివేసిన పెత్తందారికి - గొడ్డలిపెట్టు"

అధర్మాన్ని, అన్యాయాన్ని ఎదురించాలి, దోపిడీని రూపుమాపాలి అనే ఆరాటం బలహీనుల్ని సంఘటిత పరుస్తుంది. అదే బిగించిన పిడికిలి అవుతుంది. దోపిడీని, పీడనను అంతం చేయాలనే నినాదం అవుతుంది. ఆ తదుపరి విప్లవోద్యమంగా పరిఢవిల్లుతుంది. అప్పుడు "బలవంతమైన సర్పం చలిచీమల చేత చిక్కి చావదే" అనే సుమతి శతకకారుడు అన్నట్లు సామాజిక పీడకులైన పెత్తందారులంతా తలవంచక తప్పదు, లేకపోతే బలహీనుల అణచివేత నుండి పుట్టిన ఆవేశంఅనే గొడ్డలి వారి తలలను తుంచివేస్తుందని కవి హెచ్చరిక చేస్తున్నాడు. నాటి రాక్షసుల నుండి నేటి రాబందులదాకా ఈ ఫలితాన్ని అనుభవిస్తున్నారు. అయినా కుక్కతోక వంకరే అన్నట్లు తరాలుమారిన తలపులు మారటం లేదనే సందేశాన్ని కవి ఈ కవిత ద్వారా సమాజానికి అందిస్తున్నారు.

అయితే సామాజిక మార్పుకోసం ఎన్నో పోరాటాలు జరిగాయి, ఉద్యమాలు నడిచాయి అయినా ఈ సమాజంలో మార్పురాకపోవడానికిగల కారణాలను కవి 'నమ్మలేక పోయాను' అనే కవితలో స్పష్టంగా వ్యక్తం చేశారు.

"నా తమ్ముడు
మార్పు వస్తుందని పోరాడితే ఆనందించాను
తన ఉనికి మారిందని తెలిసి
నమ్మలేక పోయాను"

సామాజిక మార్పుకోసం పోరాడేవాళ్ళలో చిత్తశుద్ధి లేకపోవడం మూలంగా ఉద్యమాల ఫలితాలు ప్రజోపయోగంగా కాకుండా ఆయా నాయకుల స్వార్థ ప్రయోజనాలకే దోహదం చేస్తున్న తీరును కవి సున్నితంగా నిరసిస్తున్నారు. "ఇలాంటి వెయ్యి ఇజాలకన్న వేమన వేదమేమిన్న"అంటాడు కవి. వేమన మధ్యయుగాలనాటి కుసంస్కారాలపై,దురాచారాలపై సూటిగా స్పష్టంగా తేటతెనుగు పదాలతో ఆటవెలది పద్యాల్లో ధ్వజ మెత్తాడు. నేడు కాళోజి

కూడా అదే మార్గంలో నేటి సామాజిక అసమానతలపై, అన్యాయాలపై తన గొడవను అప్రతిహతంగా ప్రకటిస్తూనే ఉన్నాడు. ఈ సమాజంలో అన్యాయాలు ఎంత కాలం కొనసాగుతాయో, అంత కాలం ఆయన గొడవ చేస్తూనే వుంటాడు. కాళోజికి "గొడవ లేకుండా పూట గడవదు". కాళోజిలో వుండే ఈ నైజగుణాన్ని "ప్రజాకవి" అనే కవితలో బాలకిషన్‌రావు గారు చెప్పారు.

ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలోని ఈ పోరాటాల వెనుకవున్న నిజాన్ని కవి 'లొల్లి' అనే కవితలో...

*"కూడు - గుడ్డ - గూడు*
*కల్పిస్తాననే నాయకుడి వాగ్దానం*
*శూన్యమైతే*
*ఆపై చేసే ప్రతి లొల్లి ఒక పోరాటం"....*

అంటారు. హింస ద్వారా, అధికార బలం ద్వారా ఏ ప్రజా పోరాటాలను అణచలేము రాజకీయ నాయకులు తమ వాగ్దానాలను నిలుపుకొని, ప్రజా సంక్షేమానికి పాటుపడితే పోరాటాలు వాటంతకవే తెరమరుగవుతాయన్న నగ్నసత్యాన్ని ఇక్కడ 'ధ్వని' రూపంలో కవి వ్యక్తం చేశారు.

సాధారణంగా ఉద్యోగస్తులు ప్రజల పనులు చేయడానికి డబ్బులు అడిగితే మనం 'లంచం' అంటాం. కవి ఈ పదానికి మరో కొత్త అర్థాన్ని చెబుతున్నాడు.

*"జీతం తీసుకుంటూ*
*తను చేసే ఉద్యోగానికి*
*న్యాయం చేయని వాడు*
*నిజమైన లంచగొండి"*

అంటాడు కవి. అంటే జీతం తీసుకుంటూ తమ విధులను సక్రమంగా నిర్వర్తించలేని వాడు కూడా లంచగొండి కిందే లెక్కఅన్నమాట.

ఇలా కవి సమాజంలోని అసమానతలను, అన్యాయాలను, అవినీతిని, విషసంస్కృతిని

ప్రచారం చేస్తున్న ప్రతికలను, మనుషుల మనస్తత్వాలను ప్రస్ఫుటం చేస్తూ అలతి అలతి పదాల్లో అనల్పమైన అర్థాన్ని అభివ్యక్తం చేస్తూ అక్షరాలతో 'లొల్లి' చేయిస్తాడు.

"నా పాళీ - కేళి
ఆగిన పెండ్యులం
ఆయువు పోయిన శరీరం కాదు
స్వేచ్ఛకు మారు పేరు"

అని ఆత్మ విశ్వాసంతో తన కవితా తత్వాన్ని ప్రకటించిన నమిలికొండ బాలకిషన్‌రావు గారు సాహితీ సంస్థల నిర్వాహకుడిగానే కాకుండా కవిగా కూడా తనదైన ప్రత్యేకమైన బాణిని ప్రకటించుకున్నారు. ❖

# కాలం వెంట నడిచే కవి

- అనిశెట్టి రజిత

సాహిత్య పిపాసకు తడి ఆరటం అంటూ ఉండదు. తపన మహా వ్యసనం, తపన అనేది ఏమైనా చేయిస్తుంది. రాతలు రాయిస్తుంది, పాటలు పాడిస్తుంది, పుస్తకాలు అచ్చు వేయిస్తుంది.

జిల్లాలోని సాహితీ ప్రేమికుల్లో సోదరుడు నమిలికొండను ప్రస్తావిస్తే... అలుపెరుగని జిజ్ఞాసకారుడని చెప్పాల్సి వస్తుంది. కవులకు అండగా ఉండే నిండు కుండలాంటివాడు ఆయన.

ఏ సందేశం లేనిదే ఏ రచనైనా ఉంటుందా.... ఒత్తిడి, ఆరాటం, ఆక్రోశం, ఆవేశం ఇలా ఎన్నో మిశ్రమ భావనల ముట్టడి కలాన్ని కదిలిస్తుంది. అగ్నికీలలు అంటుకుంటే అవి దహించిగానీ శాంతించవు. కవి మనఃస్థితీ అదే విధంగా ఉంటుంది.

*"నా కవితకు చరిత్ర ఉంది*
*నా కలంకు ఆయుష్షుంది"* (దివిటీ-1985)

మనిషిలో హృదయం ఉన్నంత వరకు స్పందన ఉంటుంది. స్పందన కలిగిన కవి కవిత్వానికి ఆయుష్షు ఉండి తీరుతుంది. కవితామూర్తికి ఉన్న చరిత్రే ప్రేరణగా కలానికి ప్రాణం పోస్తుంది. తన కవిత "వేయి గుండెల కదలిక" కావాలని ఆకాంక్షించని కవి కవెట్లా అవుతాడు. కోయిల్లా కూసే గానమే కవిగానం (వజ్రహాసం - దివిటీ నుండి).

సమాజంలో నిత్యం జరిగే అన్యాయాలకు, అత్యాచారాలకు సభ్య సమాజికులు ఎట్లా స్పందిస్తారు... ఏం చేస్తారు... ? బంద్ పాటిస్తారు. అది... ఆ బంద్ ఎప్పటి వరకు పాటిస్తారు.... ? మార్పు వచ్చేంత వరకు... న్యాయం జరిగేంత వరకు... బాధితులకు ఊరట కలిగించే తీర్పులు వెలువడేంత వరకు. అదొక నిరసన.... అదొక ఆందోళనా ప్రకటన (బందు పాటిస్తున్నా - దివిటీ నుండి).

ఆదిమ  యుగం నుండి మానవ సమాజం పురోగతి సాధిస్తూ ఆధునిక దశకు చేరుకున్నాగానీ అప్పుడప్పుడు మనం "రాతియుగమే నయం" అని అనుకునే సందర్భాలు వస్తుంటాయి.... ఎందుకు ?

రోజూ జరుగుతున్న మారణహోమంలో సమిధలు కానిదెవరు ? మనకు శత్రువు కాని దెవరు... ? దినదినగండంగా బ్రతుకనేది మారిన వైనాన్ని ఆవేదన చెందటం "రాతియుగమే నయం" అనే కవితలో కనిపిస్తుంది. యాంత్రిక యుగ పరిణామాలు పోయిపోయి ప్రాణ గండంగా పరిణమిస్తున్న సమయాన "రాతియుగమే నయం" అని రాసారు నబారా (దివిటి - 1985).

దైనందిన సమస్యలవలయాలు మనిషిని సుడిచుట్టి జీవచ్ఛవంగా మార్చేస్తున్న ఆక్రోశం "సమస్య" కవితలో కనిపిస్తుంది. అట్లాగే నేటి మన నాయకగణాలగురించి వ్యతిరేక భావం లేకుండా ఉండగలిగిన వారెవ్వరూ ఉండరు. నాయకులకు జనం (మనం) నిత్యంచేసే సన్మానాల్ని అవహేళన చేస్తూ అంతర్లీనమైన వ్యంగ్య విమర్శతో చివరకు మనల్ని నట్టేట్లో ముంచేస్తున్న నాయకులను మనమే నిమజ్జనం చేసి వీడ్కోలు గీతం పాడేద్దాం రమ్మని ఇచ్చే పిలుపు "రండి-రండి-మీరంతా" అనే కవిత (దివిటి -1985).

చివరగా నేను పదిహేడేళ్ళ తరవాత కవి స్వీయ సంపాదకీయంలో వచ్చిన "సుక్క పొడుపు"(ప్రత్యేక సంచిక) కవితా సంకలనంలోని కవిత "పొత్తొద్దు" గురించి ప్రస్తావించాల్సి వుంది. యుగధర్మానికి కవి ఎప్పుడూ అతీతుడు కాలేడు. ప్రస్తుతం మన రాష్ట్రంలో వీస్తున్నవి ప్రత్యేక తెలంగాణా అస్తిత్వపు పవనాలు. పీడితుల, అణగారిన వర్గాల ఆత్మగౌరవ ఉద్యమాలు చరిత్రలో ఎప్పుడైనా ఉన్నవే. వివక్షతలపై తిరుగుబాటు జరగటం యుగ ధర్మం. న్యాయం కోరడం యుగనీతి. అన్యాయాల్ని ఎదిరించడం యుగావసరం. నమ్మి చేసుకున్న ఏ ఒప్పందంలోనైనా తప్పిదనాలూ, విద్రోహాలు పొడచూపితే ఏం చేస్తాం... ఆ పొత్తును ఇంక రద్దు చేసుకోవడమే మంచిదని తలపోస్తాము.

పరుల ఇంట ఆశ్రయం పొంది అన్ని సంపదలను సమకూర్చుకున్న వాళ్ళు చివరకు ఇంటివాళ్ళ నెత్తికెక్కి వారి ఆస్తుల్ని, వనరుల్ని కబ్జా చేసుకోవడంకన్నా మోసం, దగా ఉంటుందా.... దానినే నబారా

"మంచి పొలాలు, చెల్కలు, మాగాణి భూములన్ని
మీ పంట చేనులైనయి - మేము మీకు పాలేరొల్లమయినము" అంటూ
"నా మాట తెలువదంటివి - నా బాస రాదంటివి
నా యాసను ఎక్కిరిస్తివి - ఏంది మల్ల - ఎట్ల మల్ల
ఎల్లి పొండి... ఎల్లిపొండి... ఎల్లిపొండి
పొత్తు మీకింక వద్దు.... పోంఁడ్రి" అని నిర్మొహమాటంగా చెప్తాడు.

పనిగట్టుకొని తింటున్న అన్నానికి వంకలు పెట్టడం, అన్నదాతలను అవమానించడం, ఆశ్రయమిచ్చినవాళ్ళను కొల్లగొట్టడం ఒక ప్రాంతానికి చెందిన రెండే రెండు పెద్ద కులాల వాళ్ళు చేస్తూ.... వనరులన్న మన ప్రాంతాన్ని ఎడారిగా మార్చినపుడు ఈ సహజీవనం చాలిక - దోపిడీ సంబంధాల దొంగ కాపురం చాలించుకుందాం.... మీ మీ స్థానాలకు వెళ్ళి పొండని చెప్పడం తప్ప గత్యంతరం ఉండదు. అదే జరిగింది.... జరుగుతున్నది. "పొత్తొద్దు" అనే కవిత ఘోషణే నేటి తెలంగాణా ప్రాంతీయుల ఉద్ఘోష కదా.

చివరగా ఒక మాట చెప్పాలి.... కవిత్వమంటే భావుకత్వం... దానికి అధ్యయనం తోడైతే వెచ్చని పాలలో కొంచెం పెరుగు తోడువేస్తే పాలన్నీ కమ్మని మీగడ పెరుగ్గా తోడుకున్నట్లు అవుతుంది. నబారా నుండి నేను ఆశిస్తున్నది అదే అధ్యయనాన్ని.... మరింత రచనా వ్యాసంగాన్ని. అభినందనలతో....

❖

# ఆశీరభినందన

## - కోవెల సంపత్కుమారాచార్యులు

దాదాపు ముప్ఫయి మూడేళ్ల క్రితం జగిత్యాల కళాశాలలో నేను ఉపన్యాసకుడుగా పని చేస్తున్నప్పుడు అక్కడ చదివిన విద్యార్థి బాలకిషన్‌రావు. అందుకని తనకు నేను 'గురువు గారు'అంటాడాయన. అది ఆయన వినయానికీ, కృతజ్ఞతకీ ఒకసూచన. అయితే ఆయనకు నా గురుత్వం, నాకు ఆయన శిష్యత్వం అట్లా ఉంచి, సాహిత్యరంగంలో ఆయన నాకు మిత్రుడన్నది యథార్థం. కేవలం మిత్రుడే కాదు, ఆత్మీయుడాయన. ఇంచుమించు ముప్ఫ య్యేళ్లుగా వరంగల్ సాహిత్యరంగానికి ఆయన చేసిన కృషి అభినందనీయమనటంలో ఎవరికీ విప్రతిపత్తి ఉండనవసరం లేదు. ఎన్ని ఒడిదొడుకులలోనైనాసరే, ఒక సాహిత్య పత్రికను 'ప్రసారిక'గా ఇప్పటికీ వెలువరిస్తూ ఉండటం ఆయన సాహిత్య అధ్యవసాయానికి నిత్యమైన నిదర్శనం. ఆయలోని సంఘటనా సామర్థ్యం ఆ పత్రికగా రూపుదిద్దుకోవటమే కాక ఎంతోమంది యువభావుకులకు, రచయితలకు, కవులకు ఆయన కలిగించిన ఉత్సాహం, అందించిన ప్రోత్సాహం ఆయనలోని ప్రేరకతాశక్తికి ఒక చిన్న ఉదాహరణ మాత్రమే. తన కవితలు అచ్చువేసుకోవటంకన్నా, మిత్రుల రచనలు అచ్చుకావటం, నలుగురికి తెలిసిరావటం ఆయనకు ఎక్కువగా సంతోషం కలిగిస్తుందనేది ఆయన వ్యక్తిత్వం తెలిసిన వారందరికీ అవగతమయ్యే యథార్థమే. 'భాగ్య' అవార్డు నెలకొల్పి, పెద్దలకు గౌరవంగా అందించటం, యువరచయితలకు ఆత్మవిశ్వాసం కలిగే విధంగా ఆ అవార్డు అందించటం ఆయనకు అత్యంత ప్రియమైన విషయాల్లో అత్యంత ప్రధానమైనది. మళ్లీ అంత ప్రియమైనది సాహిత్య సంస్థల నిర్వహణ మాత్రమేకాక, అట్లాంటి సంస్థలకు సహకరించటం కూడా.

కవిత్వం రాసేవాళ్లను గూర్చి, వారి 'వృత్తి-ప్రవృత్తు'ల సాధర్మ్యవైధర్మ్యాల విషయం ప్రస్తావించటం మామూలు. బాలకిషన్‌రావు వృత్తి న్యాయవాద వృత్తి. తన సంపర్కంలోకి- ఆ సంపర్కం బౌద్ధికం కావచ్చు, మానసికం కావచ్చు, వ్యవహారికమూ కావచ్చు, ఏ విధమైన దయినా-తన సంపర్కంలోకి వచ్చిన వ్యక్తుల మౌలిక లక్షణాన్ని గుర్తుపట్టటం, ఆ వృత్తికి సంబంధించిన ఒక మౌలికాంశమనుకుంటాను. ఇది ఆయన చిత్రించిన 'అక్షరచిత్రాలు'లో

స్పష్టంగా కన్పిస్తుంది. వివిధ కవుల రచయితలలో తాను గుర్తించిన అంశాన్ని నాలుగయిదు చిరుపంక్తుల్లో చిత్రించిన 'చిత్ర' సంకలనమది, ఉదాహరణకు...

*"స్త్రీకి, మైదానానికి - ప్రేమలేఖలకు*
*బట్వాడానిచ్చిన హాడు - చలం-వేంకటాచలమైనాడు"*

'బట్వాడా'చేసిన 'చలం' కదలిక 'అచలం' కావటం గుర్తించవలసిన అంశం. దాదాపు నూట యాభైదాకా వ్యక్తులు ఈ చిత్రాల్లో మనను పలుకరిస్తుంటారు. మొత్తం తెలుగునాడు వస్తువైన ఈ సంకలనంలో వరంగల్-తెలంగాణలోని వ్యక్తులు ఎక్కువ. ఎందరో కవులు, రచయితలు వరంగల్‌వారు ఇందులో నమోదయి, ఎన్నో సన్నివేశాలను గుర్తుకు తెస్తారు. ఎన్నో స్మృతులను రెచ్చగొడుతూ ఉంటారు. బహుశః ఈ విధమైన సంకలనం ఇదేనేమో ! ఇటీవల మిత్రుడు ద్వానాశాస్త్రి 'సాహిత్య నానీలు' అంటూ ఒక సంకలనం వెలువరించాడు. అదింకా నేను చూడలేదుగాని, విన్నదాన్నిబట్టి దాని తీరుతెన్నుల మూలరేఖలు ఈ 'అక్షర చిత్రాల'లో ఉన్నాయనిపిస్తుంది.

*"శిల్పం శైలి - క్లుప్తత స్పష్టత*
*వరంగల్ కీర్తి కిరీటం - గార్లపాటి రాఘవరెడ్డి"*

రాఘవరెడ్డిగారు గుర్తుకొస్తే ఎన్నో మధురస్మృతులు ! వరంగల్ సాహితి చరిత్రకు ము సరుకుగా ఉపయోగించే సమాచారం అక్షరచిత్రాల్లో దొరుకుతుంది.

బాలకిషన్‌రావు మరో సంకలనం 'అక్షరాల్లో అనంతం', అవన్నీ మినీకవితలే.

*"ప్రయోగంలేని ఆయుధం మౌనంగా నిల్చిన మానవాత్మ"*
*"ఈ గుడిసె ధనుకుని సీనరీ - ఈ బంగ్లా బీదవాని కల"*

ఇట్లాంటివనేకం బాలకిషన్‌రావు 'అభివ్యక్తి శక్తి'కి బలమైన ఉదాహరణలు. బాలకిషన్‌రావు కవితలు అప్పుడే గనిలోంచి తీసిన మణుల్లాంటివి. చిత్రికపట్టని చిత్రాలు. మినీకవితలు మాత్రమే కాకుండా రాసిన కవితల సంకలనం 'శాంతి-సమత' వ్యక్తిగానూ, కవిగానూ ఆయన నినాదమది. ఆయన 'కవిత్వం' ఆరంభమైనప్పటినుంచీ అదే ధ్యేయం, అదే ఆయన జీవిత పరమార్థం. దాని సాధనయే ఆయన సర్వప్రియాకలాపం, ఆ కలాపం ఫలించాలనీ, పరిమళించాలనీ, ఇంకా విస్తరించాలనీ నా ఆకాంక్ష. ఆ ఆకాంక్షతోనే బాలకిషన్‌రావుకు నా ఆశీస్సులు, అభినందనలు, శుభాకాంక్షలు.



# కదలికలను మరువకు

*(అముద్రిత రచన)*

## - నమిలికొండ బాలకిషన్ రావు

మిత్రమా మనం ఆనాడు - ఊరి పొలం గట్లపైన బ్యాలన్సు చేస్తు నడుస్తు, పచ్చగడ్డి స్పాంజులపైన పరుగులు తీస్తు వాగు వంకలన్ని దాటి, ఇసుక తెన్నెల పెనుగాలులు వీచే ఎగిసిపడే ఇసుక రేణువులు చూస్తూ గడిపిన క్షణాలు, నాటి జ్ఞాపకాలను నెమరువేస్తు ఎత్తైన పర్వతాల్ని చదువుతు మన జ్ఞానత్వాన్ని మన మధ్య ఉన్న మౌనాన్ని పారద్రోలి ఎన్నడు వీడని మళ్ళీ మళ్ళీ జ్ఞాపకాలు చేసుకొంటు ఎన్నో ఎన్నో ప్రేమ పక్షుల్ని, చుక్కలని చూస్తు, ఆకాశం క్యాన్వాస్‌పై సంధ్యారాగాలు, గోధూళి వేళలని చిత్రాలుగా మలిచాము. ఎంతో ఎత్తు ఎదిగిన వృక్షాలని, మోడువారని చెట్లని మన జీవితాలకు ముడిపెట్టి, ఎన్నో లక్షల అక్షరాలుగా మలచి, కుమ్మరించినాము. అయిన నీకు, నాకు ఆ వంతెనో, ఆ పొలిమేరో, ఆ హద్దుల హరివిల్లో మరో కబడ్డీ హద్దు గీతో ఉందని అంత ఎడమొగం పెట్టి బాధపెట్టేదెందుకు, ఆ చలం మైదానమంత మనది కాదా, ఆ విశాల విశ్వం మన పుస్తకమై ఎన్నో పేజీలు కలిసి అక్షరాలతో ఆడుకోని, ప్రపంచ చదరంగ పావుల కదలికల గమనించిన రోజులు ఇంకా జ్ఞాపకాలు మన మెదళ్లు ఆనాడే కంప్యూటర్ బిట్స్‌గా మారి సైబర్ ప్రాంగణాలలో ఎన్ని ఇ-మేల్స్, ఆపై ఎన్నో ఛాటింగ్ మరెన్నో చిలిపి చిలిపి కంప్యూటర్ కూడికలకు, అబ్బా ఏమీ వైపరీత్యంఅన్ని నీకు జ్ఞాపకాలే మరిః ఆ వీచే పైరగాలులు ఒక్కసారి నీ కండూతీ ! అమాంతం గాలిలో పై కెగిరి ఆకాశ విమానమైన ఏ అమెరికా, మరే విదేశమో ప్రయాణమై చ్చి నీ పక్కన ఉన్నపుడు ఎంత అనుభూతిపడ్డాం.

ఆ రామవరం - ఈ కృష్ణ, మన గోదావరి పొంగులు, మన పూర్వ కవుల ప్రబంధాలన్ని గేసి ఇంకా... ఇంకా సాహిత్య మాధుర్యాన్ని, మాధుర్య మకరందాలని రుచి చూస్తూ రసాల నీలల్లో మనం విహరించి ఎంత అనుభూతిని మరెంతో ఉన్నతాన్ని ఆస్వాదించిన రోజులు జ్ఞాపకమున్నాయా ! నీవు దిట్టవని, పొగడి ఆ ఏటి ఒడ్డున ఉసికరాలని జనం -

కాలం వెంట నడిచి వస్తున్న...

ప్రకృతి మధ్య ఆవకాశం నీపై ముత్యాల చినుకులు కురిపించి ప్రశంసించినపుడు నేనెంతో తబ్బి ఉబ్బి నీ ఆలింగనంలో నా ప్రేమతో నీ సంతోష వర్షం నన్ను తడిపేసినపుడు నిజంగా అది మన మన ప్రమాణానికి మైలురాయి, దాటిన ఆవలిగట్టు, నీవు ఆనాడు అన్ని కథలు చెప్పకు అన్న వినయానికి రారా మిత్రత్వం ఎంత ఎత్తు ఎదిగావో.... మన నీడలే గుర్తులు.

ఈ కాగితానికి ఇంకా కొన్ని సిరా చుక్కలు రాలిన, నా మదిలో మరెన్నో తెల్ల కొంగలు ఎగిరిపోతున్నట్లు మిత్రమా !

నీవు కవివైతే నేను నీతో నడిచే అక్షరాల కదలికను మిత్రమా !



జ్ఞాపకాలు - జ్ఞాపకాలు.

## ఈ అభినందన సంచికలోని రచయితలు...

1. డా॥ టి. శ్రీరంగస్వామి, M.A., Ph.D.
   ఇ.నెం. 5-11-481, విద్యారణ్యపురి, హన్మకొండ, జి॥ వరంగల్లు - 506 009

2. శ్రీ పల్లేరు వీరస్వామి, M.A., B.Ed. (Ph.D.)
   ఇ.నెం. 3-305, మల్లారెడ్డిపల్లి వీధి, మం॥ పరకాల, జి॥ వరంగల్లు - 506 167

3. శ్రీదాస్యం లక్ష్మయ్య,
   ఇ.నెం. 11-73/2, హన్మకొండ రోడ్డు, హుస్నాబాద్, జి॥ కరీంనగర్ - 505 467

4. శ్రీ నందనం కృపాకర్, M.A., B.Ed.
   వైస్ ప్రిన్సిపాల్, సెయింట్ పీటర్స్ హై స్కూల్,
   విద్యానగర్, హన్మకొండ, జి॥ వరంగల్లు - 506 001

5. శ్రీ పల్లె సీను, M.A.
   లెక్చరర్, ఇ.నెం. 2-1-14, సరస్వతీ నగర్, విద్యారణ్యపురి, హన్మకొండ,
   జి॥ వరంగల్లు - 506 009

6. ఎమ్మెస్సార్ (మండవ సుబ్బారావు), M.A., B.Ed., LL.B., M.Phil.
   ప్రిన్సిపాల్, వివేకవర్థిని జూనియర్ కళాశాల, లక్ష్మీదేవిపల్లి, కొత్తగూడెం,
   జి॥ ఖమ్మం - 507 101

7. డా॥ పి.వి. రమణ, M.A., Ph.D.
   అమీర్‌పేట, హైద్రాబాద్ - 500 016

8. డా॥ వి. వీరాచారి, M.A., Ph.D.
   ఇ.నెం. 2-11-43, గోపాల్‌పూర్ రోడ్, విద్యారణ్యపురి, జి॥ వరంగల్లు - 506 009

9. అనిశెట్టి రజిత, M.A.
   ఇ.నెం. 3-12-61, కుమార్‌పల్లి, హన్మకొండ, జి॥ వరంగల్లు - 506 001

10. ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు,
    ప్లాట్ నెం. 341-ఎ, రోడ్ నెం. 6, గ్రీన్ పార్క్ కాలనీ, సరూర్‌నగర్ వాటర్ ట్యాంక్,
    హైద్రాబాద్ - 500 035



